# ఆంధ్రపత్రిక

317230



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 35, No. 219 FRIDAY 12th NOVEMBER 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

# నైరుతి ఆఫ్రికాలో యూనియన్ ప్రభుత్వ విధానంపై విచారణ జరిపించాలి

## మలాన్ ప్రభుత్వ జాతి విద్వేష చర్యల ఖండన

### ధర్మకర్తృత్వ సంఘంలో సమితికి శ్రీమతి విజయలక్ష్మి హెచ్చరిక

పారిస్, నవంబరు 10: 'నైరుతి ఆఫ్రికాను నిరాలస్యముగా ధర్మకర్తృత్వముక్రింద నుంచవలెనని ఐక్యరాజ్యసమితివారు దక్షిణాఫ్రికాను ఆదేశింపవలెను. ప్రజలు ఎట్టి ఏర్పాటును వాంఛించుచున్నారో విచారించుటకు నైరుతి ఆఫ్రికాకు ఒక ప్రత్యేక కమిషనును పంపు టవసరము.' అని నేడు ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వ సంఘములో భారతదేశ ప్రతినిధి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ చెప్పెను.

నైరుతి ఆఫ్రికాను ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వము క్రిందనుంచ ద. ఆఫ్రికా నిరాకరించుచున్నందుకు ద. ఆఫ్రికా రాయబారవర్గ నాయకుడు ఎరిక్‌లో నిన్న చెప్పిన కారణములను పరిశీలింప నేడు ధర్మకర్తృత్వసంఘమువారు సమావేశమైరి. పూర్వము జర్మను కాలనీగానున్న నైరుతి ఆఫ్రికా ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వముక్రింద నుండుటకు అనుమతింపవలెనని ఐక్యరాజ్యసమితి సభ్యులు గావించిన సూచనను ద. ఆఫ్రికా నిరాకరించుటకిది మూడవసారి.

నైరుతి ఆఫ్రికాకు యిప్పటికంటె యెక్కువ స్వపరిపాలనాధికారముల నొసంగ ద. ఆఫ్రికా సంకల్పించుచుండెనని, ఇటీవల ద. ఆఫ్రికా నైరుతి ఆఫ్రికాతో గావించుకొనియుండిన ఒడంబడిక నైరుతి ఆఫ్రికాను ద. ఆఫ్రికాలో కలుపుకొనునట్టిదికాదని, ఉభయ దేశములకు సన్నిహిత తరములైన సంబంధము లేర్పడుచున్నదని ఆతడు చెప్పియుండెను.



ద. ఆఫ్రికా రాయబారవర్గ నాయకుని వాదములను నిశితముగా విమర్శించుచు శ్రీమతి విజయలక్ష్మి పండిట్ యిట్లు చెప్పెను: "నైరుతి ఆఫ్రికా ప్రజలు ధర్మకర్తృత్వమునకు విముఖులుగా నున్నారా, ద. ఆఫ్రికా తమ్ము కలుపుకొనుటకు అనుకూలురుగా నున్నారా అను విషయమును కనుగొనుటకు నైరుతి ఆఫ్రికాకు నిష్పాక్షికమైన ఐక్యరాజ్యసమితి కమిషను పంపుట అత్యంత ముఖ్యము. యూనియను ప్రభుత్వ వైఖరిని ఐక్యరాజ్యసమితి యెంత మాత్రము అంగీకరింపజాలదని మనము ప్రకటింపవలెను. నైరుతి ఆఫ్రికాను కలుపుకొనదలచుట యూనియన్ ప్రభుత్వము గావించిన వాగ్దానమునకు విరుద్ధమని, నైరుతి ఆఫ్రికాను ధర్మకర్తృత్వము క్రింద నుంచవలెనని ఐక్యరాజ్యసమితి అనేకసారులిచ్చిన సలహాను ద. ఆఫ్రికా నిర్లక్ష్య భావముతో చూచెనని, నైరుతి ఆఫ్రికాను కలుపుకొనరాదని 1946 సం॥ను గావింపబడిన తీర్మానమును ద. ఆఫ్రికా ధిక్కరించెనని మనము నిర్ద్వంద్వముగా ప్రకటింపవలెను. ద. ఆఫ్రికా నైరుతి ఆఫ్రి

[2 పేజి చూడుడు]

## ఉత్తర అట్లాంటిక్ రక్షణ

### వచ్చే జనవరిలోగా ఒడంబడికపై సంతకాలు

ఆట్టావా, నవంబరు 10: ఉత్తర అట్లాంటిక్ రక్షణ నిమిత్తమై కెనడా అమెరికాలు, పశ్చిమ యూరోపు యూనియన్ రాజ్యములు కలసి కుదుర్చుకొను ఒడంబడిక 1949 జనవరి నెల లోపుగా పూర్తియై, ఒడంబడికపై సంతకములు జరుగగలవని, కెనడా ప్రభుత్వం నిర్ణయించు కొన్న కార్యక్రమమును బట్టి నేడు తెలియ వచ్చినది.

ఈ ఒడంబడికకు సంబంధించిన ఆయా రాజ్యముల రాయబారులు, క్రిస్టమస్ పండుగ లోపుగా, వాషింగ్టన్‌లో ఉత్తర అమెరికన్ నాయకులను కలుసుకొని, ఒడంబడిక షరతులను వ్రాసుకొందురు.

## సర్ రామస్వామి మొదలియార్ గారికి కొత్తపదవి?

లండన్, నవంబరు 10: ఐక్యరాజ్యసమితి విద్యా, సాంస్కృతిక సామాజిక సంఘమునకు ప్రొఫెసర్ జూలియన్ హక్స్లీ స్థానే సర్ ఆర్కాట్ రామస్వామి మొదలియార్ గారిని డైరెక్టర్ జనరల్‌గ నియమించెదరని తెలియుచున్నది. (యు. ప్రె.)

## తమ అధీనంలో ఉన్న కీలక పరిశ్రమలను జర్మనుల పరంచేయుటకు బ్రిటన్, అమెరికా నిర్ణయం

ఫ్రాంక్‌ఫర్ట్, నవంబరు 10: పశ్చిమ జర్మనీలోని బొగ్గు, ఉక్కు, ఇనుము మొదలైన భారీ కీలక పరిశ్రమలు జర్మన్లకు వాపసు ఇచ్చివేయబడునని, బ్రిటిషు అమెరికన్ మిలిటరీ అధికారులు నేడు ఇక్కడ ప్రకటించిరి.

పరిశ్రమలను ప్రభుత్వపరం చేయవలెనా, లేక వ్యక్తులపరంగానే ఉంచవలెనా అన్నది జర్మన్లే నిర్ణయించుకోగలరనీ, కాని ఇది వరకులాగా పరిశ్రమలన్నీ, కొద్దిమంది చేతులలో కేంద్రీకృతం కాకుండా మిలిటరీ ప్రభుత్వం జాగ్రత్త తీసుకుంటుందని, మిలిటరీ అధికారులు ప్రకటించిరి.

పరిశ్రమల నిర్వహణకు కొంతమంది జర్మన్ ధర్మకర్తలను ఏర్పరచి, వారికే పరిశ్రమలకై అధికారస్వామ్యములన్నీ ఇవ్వవలెనని నిర్ణయింపబడెను. పూర్వపు నాజీ ప్రభుత్వంలో సంబంధం ఉన్న జర్మన్ ధనికులను నెవ్వరినీ పరిశ్రమలలోకి మళ్లీ అడుగు పెట్టనివ్వకుండా చేయడం అవుతుంది.

పశ్చిమ జర్మనీలోని ప్రధాన ప్రాతిపదిక పరిశ్రమలలో ఉత్పత్తిని అభివృద్ధి చేయుటకు సాధనోపాయంగా ఈ ప్లాను వేయబడినది. పరిశ్రమలపై పర్యవేక్షణాధికారమంతా తమ చేతులలో ఉంచుకొని నిర్వహణాధికారమును వికేంద్రీకరించుటకు ఇది సహాయభూతం కాగలదు. బ్రిటిష్ అమెరికన్ మండలముల జాయింటు కంట్రోలు ఆఫీసులోని మిలిటరీ అధికారులు, జనరల్ సర్ గార్డన్ మాక్రెడీ (బ్రిటన్), జనరల్ క్లారెన్సు ఆడ్‌కాక్ (అమెరికా) ఫ్రాంక్‌ఫర్టులో నేడు యీ విషయములను వెల్లడించుచూ ఇట్లుచెప్పిరి: "పరిశ్రమలను ప్రభుత్వపరం చేయవలెనా, లేక వ్యక్తుల పరంగానే ఉంచవలెనా అన్న విషయమును స్వేచ్ఛగా ఎన్నిక అయిన ప్రజాప్రతినిధి ప్రభుత్వమే నిర్ణయించవలసి యున్నది. అంతవరకు ఈ సమస్య అనిశ్చితంగానే ఉంటుంది."

### ఫ్రాన్సు అధిక్షేపణ

ఫ్రాన్సు, నవంబరు 10: రూర్‌లోని బొగ్గు ఉక్కు పరిశ్రమలపై అధికారమును జర్మన్లకు వాపసు ఇచ్చివేయవలెనని బ్రిటన్ అమెరికాలు చేసిన నిర్ణయమునకు ఫ్రాన్సు నేటిరాత్రి అధిక్షేపణ తెలిపెనని ఫ్రెంచి విదేశాంగ కార్యాలయం ప్రకటించెను. ఈ నిర్ణయమునకు ఫ్రాన్సు ఆలోచించజాలదని, రేపు లండన్‌లో రూర్‌పై జరుగనున్న షట్రాజ్య సమావేశంలో కూడా విస్పష్టంగా చెప్పివేయవలసిందని ఫ్రెంచి విదేశాంగమంత్రి రాబర్టుషూమన్ తన ప్రతినిధి హెర్వ్ అల్ఫాండ్‌కు ఉత్తర్వుచేసెను.

## అమెరికన్ విమానములకు రష్యన్ల హెచ్చరిక

బెర్లిన్, నవంబరు 10: జర్మనీలోని సోవియట్ ఆక్రమితమండలంపై గుర్తు తెలియని "విమానం ఏది కనిపించినా కూల్చివేస్తామనీ, ఆకాశంలో తాము నిర్ణయించిన హద్దుమేరలను అతిక్రమించి ప్రయాణంచేసే విదేశ విమానములను గుర్తు తెలిసినా కాల్చివేయడం అవుతుందనీ, బెర్లిన్‌లోని రష్యన్ అధికారులు నేటిరాత్రి అమెరికన్ అధికారులకు తెలియజేసిరి.

రష్యన్ల బెదిరింపులను ఎదుర్కొనడానికి, రవాణా విమానముల వెంట ఇకనుంచి పోరాటవిమానములను కూడా పంపుతారా? అని ఒక ఉన్నత అమెరికన్ మిలిటరీ ఉద్యోగిని ప్రశ్నింపగా, అతడిట్లు చెప్పెను: "ఆ సంగతి అవసరం వచ్చినప్పుడు ఆలోచిస్తాము. మనకు ఎలాగైనా పిరికిమందు పెట్టాలని రష్యన్లు చూస్తున్నారు; ఇందులో కొత్త ఏమీ లేదు." అమెరికన్లకు పంపిన ఉత్తరానికి నకలు తమకేదీ రాలేదని బెర్లిన్ విమానాశ్రయ పర్యవేక్షణ కేంద్రంలో, పశ్చిమ రాజ్యప్రతినిధులకు కూడా ఆ ఉత్తరం ప్రతి పంపబడలేదనీ ఒక బ్రిటిష్ ఉద్యోగి చెప్పెను.



కాశ్మీర్ యుద్ధరంగమున వున్న భారతీయసైనికులకు రాయల్ ఇండియన్ సైనిక సరఫరా దళమువారు ఏ దినమునకు ఆ దినము ఆహారపదార్థములు, ఇతర సరఫరాలు అందజేయుచున్న దృశ్యము. ప్రతిదినము ప్రాంతీయ సరఫరా గిడ్డంగివద్ద చేరి సైనికులు తమ సామగ్రిని స్వీకరించెదరు.

# చైనాలో సైనిక శాసనం

## సూచౌ నగరానికై తీవ్ర సంగ్రామం

### చైనా ప్రభుత్వ సేనలో విప్లవం: నాంకింగ్‌లో అరాచకం

నాంకింగు, నవంబరు 11: చైనా రాజధాని నాంకింగ్ నగరములోనూ, పరిసరములలో వున్న దాదాపు 40 వేల చ॥ మైళ్ల ప్రాంతములోనూ నేటినుండి సైనికశాసనము అమలుచేయబడినది. నాంకింగుకు దక్షిణమున 160 మైళ్లలోవున్న హాంగ్‌చౌ పట్టణం మొదలు నైరృతిదిక్కున 175 మైళ్ళలో వున్న షాంఘైవరకు, ఉత్తరమున 100 మైళ్ళలో వున్న పెంగుపిన్‌వరకు ఈ సైనికశాసనము వర్తించును. నాంకింగులో రాత్రి 10 మొదలు ఉదయము 6 గం. వరకు కర్‌ఫ్యూ ఉత్తర్వు కూడ జారీచేయబడెను. తన ప్రాంతమున "సంపూర్ణ యుద్ధవిధానము"ను పాటించదలచినట్లు షాంఘై సేనాని లెఫ్టినెంట్ జనరల్ హుసాన్‌టిపూ ప్రకటించుచున్నాడు. ఆహార ధాన్యమునకై దొమ్మి సాగించువారికి తీవ్రశిక్ష విధింపబడునని కూడా ఇతడు హెచ్చరించుచున్నాడు.

### ఆహార గిడ్డంగులపై క్షుద్బాధితుల దాడులు

నాంకింగు, నవంబరు 10: చైనా ప్రధాన నగరం నాంకింగుకు 200 మైళ్ల ఉత్తరంగా ఉన్న సూచౌ దుర్గంవద్ద చాంగ్-కై-షేక్ సేనలకు, కమ్యూనిస్టు సేనలకు నేటి రాత్రి నుంచి తీవ్ర సంగ్రామం ప్రారంభమైనది. నాంకింగ్‌నగరానికి మార్గంలో ఇదే ఆఖరు దుర్గం. సూచౌనగరంపై కమ్యూనిస్టు సేనలు మూడు దిశలనుంచి వచ్చి ముట్టడించినవి. షాన్సీ రాష్ట్ర రక్షణను విడిచి వెంటనే చాంగ్-కై-షేక్ వీలైనంత వరకు తన బలాల నన్నిటినీ సూచౌ రక్షణకు కేంద్రీకరించుచున్నాడు. సూచౌ నగరంలోని ప్రభుత్వ సేనలలో రెండుదళాలు తిరుగుబాటు చేసినట్లునూ, వెంటనే అణచివేయబడినట్లునూ ఇక్కడికి వార్తలు చేరినవి.

నాంకింగ్, షాంఘై నగరాలలో అన్నాతురులైన వేలాది ప్రజలు రాత్రి వీధులలో తిరుగుతూ ఆహార భాండారాలపై దాడులు ప్రారంభించినారు. పోలీ

(4-వ పేజి చూడుడు)

## ఢిల్లీలో కార్మికుల లాంఛనపు సమ్మె

న్యూఢిల్లీ, నవంబరు 10: ఢిల్లీలోవివిధ పరిశ్రమలలో పనిచేసే కార్మికులు 30 వేల మంది నవంబరు 18 న లాంఛనపు సమ్మె చేయుదురని శ్రీమతి అరుణ ఆసఫాలీ నేడు ప్రకటించెను.

## ఫతీమా జిన్నా ఇంటి దొంగతనము

### కాయిదేఆజాం చిత్రపట విధ్వంసము

[ఆంధ్రపత్రిక విలేఖరి]

కరాచీ, నవంబరు 8: కాయిదే ఆజాం జిన్నా సోదరి ఫతీమా జిన్నా నివాసమైన ఫ్లాగ్‌స్టాఫ్ భవనమున ఈ మధ్య ఒక తస్కరుడు రాత్రిపూట ప్రవేశించి, కొంత రొఖము, ఆభరణములు దుస్తులు అపహరించెను. ఈ సంఘటన పాకిస్థాన్ పోలీసు ఉద్యోగులను దిగ్భ్రమపరిచినది. ఆస్తిని అపహరించుటేగాక, తస్కరుడు చాల అందమైన కాయిదే ఆజాం చిత్రపటము నొకదానిని ముక్కలుముక్కలుగ చించి వైచెను. ఏతస్కరుడైనను ఆస్తిని దొంగిలించుట సహజమేగాని, పాకిస్థాన్ నిర్మాత అయిన జిన్నా చిత్రమును ఏలచించి వేయ బుద్ధిపుట్టినదో బోధపడక పాకిస్థాన్ పోలీసు ఉద్యోగులు తికమక పడుచున్నారు.

### మదరాసు హైకోర్టు శలవులు

చెన్నపట్నం, నవంబర్ 11: మదరాసు హైకోర్టు క్రిస్‌మసుకుగాను డిశంబరు 20 నుండి 31 వ తేదీవరకు మూయబడును.

## గ్రీస్ వివాదంపై ఉభయపక్షాలు తక్షణం శాంతిసంప్రతింపులు ప్రారంభించాలని సమితి ఆదేశం

పారిస్, నవంబరు 11: గ్రీసు వివాదపై ఉభయపక్షాలు కలిసి పారిస్‌లో తక్షణమే శాంతి సంప్రతింపులు ప్రారంభించవలెనని ఐక్యరాజ్యసమితి నిన్న ఒక తీర్మానములో విజ్ఞప్తిచేసెను. మార్కోస్‌యొక్క సైన్యములకు తోడ్పడుచున్నందుకు యుగోస్లావియా, బల్గేరియా, అల్బేనియాలను గర్హించుచూ వేరొక తీర్మానముకూడా చేయబడెను. గ్రీసు సమస్యకు పరిష్కార మార్గం ఆలోచించడానికి గ్రీసు, యుగోస్లావియా, బల్గేరియా, అల్బేనియాల ప్రతినిధులను, జనరల్ అసెంబ్లీ అధ్యక్షుడు పారిస్‌లో తక్షణమే సమావేశపరచవలెనని, కోరుతూ ఆస్ట్రేలియా ప్రతినిధి ప్రతిపాదించిన తీర్మానం రాజకీయసంఘ సమావేశంలో నిన్న ఏకగ్రీవంగా ఆమోదింపబడెను.

యుగోస్లావియా, బల్గేరియా, అల్బేనియాలను గర్హించుచు పాశ్చాత్యరాజ్యాలూ చైనాకలిసి ప్రతిపాదించిన సంయుక్త తీర్మానమునకు 46 వోట్లు అనుకూలముగాను 6 వోట్లు వ్యతిరేకముగాను వచ్చెను. ఈ తీర్మానమును వీలైనంతసేపు వోటింగుకు రాకుండా చేయడంకోసం యుగోస్లావియా ప్రతినిధి తన ప్రసంగాన్ని అంతులేకుండా సాగించడానికి ప్రయత్నించెను. అయితే రాజకీయ సంఘము యొక్క కార్యక్రమానికి అడ్డుపడడం తన ఉద్దేశ్యంకాదనీ, తెరవెనుక రాజీ సంప్రతింపులకు అవకాశం కల్గించవలెనన్న సదు

(4-వ పేజి తరువాయి)

## కాశ్మీర్‌లో పాకిస్థాన్ విమానం

### భారత ఫిరంగుల కాగలేక పలాయనం

న్యూఢిల్లీ, నవంబరు 10: గిల్గిత్‌కు 40 మైళ్లు దక్షిణంగా చీలాస్‌వద్దనున్న విమాన మార్గంలో ఎగురుతూ, పాకిస్థాన్ సరఫరా విమాన మొకటి నవంబరు 4 వ తేదీన దుండగీండ్రకు వివిధములైన సామగ్రిని జారవిడుచుటను భారత విమానగస్తీదళం వారు గమనించిరి. తరువాత పాకిస్థాన్ విమానమును దగ్గరలో ఉన్న భారత విమానాశ్రయంలో దిగవలసినదని ఆజ్ఞాపించిరి. కాని ఆ వైమానికులు వినలేదు. వెంటనే మనవారు ఎదిరి విమానంపై రెండుసార్లు ప్రేల్చిరి. అప్పుడా విమానము పాకిస్థాన్ సరిహద్దుకు పారిపోయెను. ఆ విమానము కొద్దిగా దెబ్బతిని ఎత్తుకుపోలేకపోయిన దట.

## మద్రాసీలకు షేక్ అబ్దుల్లా సందేశం

కాశ్మీర్ యుద్ధరంగాలలో మద్రాసీ సేనలు చేసిన సాహసకృత్యములను, వారు కాశ్మీర్ స్వాతంత్ర్య రక్షణకు చేసిన త్యాగములను ప్రశంసించుచు, కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా మద్రాసు ఆరిక మంత్రి బి. గోపాలరెడ్డికి ఒక సందేశము పంపెను.

"స్వతంత్ర భారతదేశం జరుపవలసి వచ్చిన ప్రథమ యుద్ధంలో, ప్రజాస్వామ్యమును, సత్యమును రక్షించుటకు మద్రాసీ సైనికులు చూపిన అసమాన ధైర్యశౌర్యములు ఇండియాకు మహోన్నత గౌరవము సాపాదించినవి." అని ఆ సందేశ సారాంశము.

## జపాన్ యుద్ధ నాయకుడు టోజో

### మిలిటరీ న్యాయస్థానంలో దోష నిరూపణ

టోకియో, నవంబరు 10: యుద్ధకాలములో జపాన్ ప్రధానిగా ఉన్న జనరల్ హిడెకిటోజో, మరొక నాయకుడు దురాక్రమణోద్దేశముతో యుద్ధములు జరిపినట్లునూ, వీ రిద్దరూ దోషులుగా నిరూపించబడినట్లునూ నేడు అంతర్జాతీయ న్యాయ సంస్థ తీర్పు నిచ్చినది.

జపాన్ యుద్ధము వాస్తవముగా ప్రారంభించినది పెర్ల్ హార్బరువద్ద కాదనీ,(1941 డిశెంబరు 8) అంతకు గంట నలభై నిమిషాలకు ముందుగా మలయాలో కోటాభామా సముద్రతీరంపై యుద్ధ నౌకలు శతఘ్నులు కాల్చుటతో ప్రారంభ మైనదని తీర్పు చెప్పబడింది.

ఏ హేతువు లేకుండా బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు హాలండు ప్రభుత్వాలపై జపాన్ యుద్ధంచేసిందనీ, అంతర్జాతీయ నిబంధనలను, ఒడంబడికలను, వాగ్దానాలను అన్నిటినీ జపాన్ అతిక్రమించిందనీ తీర్పులో చెప్పబడింది. ఈ యుద్ధాలకు 1940 నుంచీ యుద్ధనాయకులు తంత్రములు పన్నినారు.

న్యాయస్థానంలో భారతదేశ ప్రతినిధి జస్టిస్ పాల్‌గారి భిన్నాభిప్రాయాన్ని న్యాయస్థానంలో చదువుటకు నిరాకరించినారు.

## డచ్చి, ఇండొనీషియన్ సమస్య

బటేవియా, నవంబరు 10: డచ్చి ఇండొనీషియన్ ప్రతిష్టంభనమును పరిష్కరించుటకై 10 రోజులక్రిందట బటేవియాకు వచ్చిన డచ్చి విదేశాంగ మంత్రి డా॥ స్టిక్కర్ రేపు హాలండుకు తిరిగి వెళ్లుచున్నాడు.

రిపబ్లికన్ రాజధాని జోగ్జకర్తా నుండి నేడిక్కడకు తిరిగివచ్చిన రగురు డచ్చి ప్రతినిధులు తాము రిపబ్లికన్ ప్రధాని డా॥ హట్టాతో మాట్లాడినదాని ఫలితముగా కొన్ని విషయములు స్పష్టమైనవనీ, వానిని డా॥ స్టిక్కర్‌కు ఎరిగించెదమనీ అన్నారు.

ఇండొనీషియా పరిస్థితిలో తీవ్రత కొంత తగ్గినదని, రిపబ్లికనులతో సమాధానం కుదిరే సూచనలు కల్పిస్తున్నవని నేడు డా॥ స్టిక్కర్ అన్నాడు.

# నైరుతి ఆఫ్రికా

## మలాన్ ప్రభుత్వ విధాన విమర్శ

(1-వ పేజీ తరువాయి)

కాను నిరాలస్యముగా ధర్మకర్తృత్వము క్రింద నుంచవలెనని, అంతవరకు దానిని మాండేటు క్రింద నున్న దేశమును ఎట్లు పరిపాలింతురో అట్లు పరిపాలించవలెనని మనము స్పష్టముగా, అసందిగ్ధముగా ప్రకటింపవలెను. ఐక్యరాజ్య సమితికి రెండు మార్గములు మాత్రమే కలవు. ఒకటి అపజయము నంగీకరించి ద. ఆఫ్రికా నైరుతి ఆఫ్రికాను తనలో కలుపుకొనుటకు అంగీకరించుట. రెండవది, నైరుతి ఆఫ్రికాన్యస్య కర్తృత్వము విషయమై అంత్యనిర్ణయము గావించి, తామిచ్చు పలహాను ద. ఆఫ్రికా అమలుచేయునట్లు చూచుట. నైరుతి ఆఫ్రికాను కలుపుకొనుటకు చట్టరీత్యా ద. ఆఫ్రికాకు హక్కు లేదు. ఇట్లు కలుపుకొను యోచనల నన్నిటిని విసర్జింపవలెను. నైరుతి ఆఫ్రికా వాసులు తమకు అనుకూలురుగా నున్నారని ద. ఆఫ్రికా రాయబార వర్గమువారు పదేపదే ఉద్ఘాటించి యుండుటచేత ఐక్యరాజ్య సమితి కమిషను నొకదానిని నైరుతి ఆఫ్రికాకు పంపుట అత్యంతావశ్యకమైన చర్యగానుండును. రిఫరెండమును ఆక్షేపించుచు ఐక్యరాజ్య సమితికి సంఖ్యాకములైన దిరఖాస్తులు పంపబడియుండుట చేత యిట్టి కమిషనును నియమించుట సబబు గూడ అగును. ఇట్టి భావములు కల తీర్మానమును ప్రతిపాదించు హక్కును భారత రాయబార వర్గమువారు ఉంచుకొనుచున్నారు.

### నైరుతి ఆఫ్రికా దుస్థితి

నైరుతి ఆఫ్రికా స్థితి నిరాశాజనకముగా నున్నది. ఆ దేశమునందలి ఆదిమవాసుల స్థితి నానాటికి దుర్భరముగుచున్నది. నానాజాతిసమితి అస్తమయముతో ఆ దేశముపై సంరక్షణాధికారము నెరపు హక్కు ద. ఆఫ్రికాకు సంక్రమించెనని ఎరిక్ లో చెప్పినమాటలను నేనెంతమాత్రమును అంగీకరింపజాలను. నైరుతి ఆఫ్రికా విషయమై ద. ఆఫ్రికా ప్రభుత్వము సమర్పించిన నివేదికపై ధర్మకర్తృత్వసంఘ వ్యాఖ్యానము తిలకించిన యెడల ఆ దేశ పరిపాలనము బాగుగాలేదని తెలియగలదు. ప్రజలు అజ్ఞానులుగాను బీదలుగాను వున్నారని ప్రజల ఆర్థిక, సాంఘిక జీవనము మొదలంట సోదింపబడినదని, ప్రజలకు రాజకీయ హక్కు లేమియు లేవని తెలియగలదు. నైరుతి ఆఫ్రికాలో ద. ఆఫ్రికా అవలంబించుచున్న విధానము వల్ల దేశ ద్రిమ్మరులు, భూమిలేనివారు, నైపుణ్యము లేనివారు నవ కార్మికులేర్పడినారు. ఒకానొక సమయమున ఆత్మగౌరవము కలవారు, తలకాయ యెత్తుకొని తిరుగగలిగినవారు క్రమేపి నైతికపతనము నొందిరి.

### జనరల్ స్మట్సు హెచ్చరిక

నిన్న దినములో జనరల్ జాన్‌స్మట్సు యేమి చెప్పెనో చూతుము. "జాతీయ పక్షము ఉపద్రవకరములగు విధానముల నవలంబించుచుండ నేనూరకుండగల ననా? ఇందువల్ల జరుగుచున్న హాని విషయమై నేను ప్రజలను హెచ్చరించుచున్నాను, ఇకమీదట గూడ నేను హెచ్చరించుచునే యుందును. ద. ఆఫ్రికాలో ఐరోపియనులుకాని వారి స్వల్ప హక్కులనుగూడ తొలగించు విధానమును ప్రభుత్వమిపా రవలంబించుచున్నారు. ఉత్తరోత్తరా ఐరోపియనులు దీని ఫలితముల ననుభవింపవలసియుందురు." అని స్మట్సు చెప్పెను. ఇది సామాన్యమైన జోస్యము కాదు. ఇట్టి హెచ్చరికను ద. ఆఫ్రికా అలించుట శ్రేయస్కరము. ఇట్టి విధానముయొక్క దుష్ఫలితములను ఉత్తరోత్తర ఐరోపియనులు అనుభవించెదరు.

### మైకేలు స్కాటుకు ప్యాస్‌పోర్టు నిరాకరణ

రెవరెండు మైకేలు స్కాటు ప్యారిసు వచ్చుటకు ద. ఆఫ్రికా ప్రభుత్వమువారు అనుమతి నిరాకరించిరని మా రాయబార వర్గమువారు యిప్పుడే వినియున్నారు. స్కాటు గొప్ప సద్గుణములకు కట్టుబడినవాడు. ఆయన న్యాయబుద్ధి కలవాడనుట నిస్సంశయము. ఇప్పుడు ప్రవాసమునందున్న హెరేరో జాతి సద్గుణ విశ్వాసమునకు అమితంగా ఆయన పాత్రుడైనవాడు. తమకు వర్ణనమునకు మాటాడవలసినదని హెరేరోజాతివారు గావించిన ప్రార్థనను ఆయన నిరాకరించుము, మైకేలు స్కాటును ప్యారిస్‌కు రాకుండా చేయుచు నైరుతి ఆఫ్రికా ఆదిమవాసుల యెడల దక్షిణ ఆఫ్రికా విధానము యేమియు మారదని ఆయన నైరుతి ఆఫ్రికా రాజకీయనాయకులకు హామీ యొసంగియున్నాడు. నైరుతి ఆఫ్రికాలో ఐరోపియనులు కానివారికి వోటింగు అధికారములు విస్తరింపజేయుట ఎన్నటికి జరుగదని ఆయన చెప్పియున్నాడు. ఇట్టి అవకాశము (వోటింగు హక్కులిచ్చు అవకాశము) పూర్తిగా తొలగవలెనన్న నైరుతి ఆఫ్రికాను ధర్మకర్తృత్వాధికారము క్రిందికి తప్పనిసరిగా తేవలెనని గూడ ఆయన చెప్పియున్నాడు.

### ఐక్యరాజ్యసమితికి అగౌరవము

నైరుతి ఆఫ్రికా భవిష్యత్తుకు సంబంధించిన సమస్య ఐక్యరాజ్య సమితి యెదుటికి మూడవసారి వచ్చుట భారత రాయబారవర్గమునకు విపులమైన సంతాపము కలిగించినది. ఇందువల్ల ద. ఆఫ్రికా ఐక్యరాజ్య సమితి నిర్ణయములను నిరాదరణతో చూచుచున్నట్లును, ప్రపంచ ప్రజాభిప్రాయమును నిర్లక్ష్యము చేయుచున్నట్లును సూచితమగుచున్నది. దీర్ఘ చర్చానంతరము గత సంవత్సరము జనరల్ ఎసెంబ్లీవారు యిందు విషయమై ఒక తీర్మానము నామోదించిరి. జనరల్ ఎసెంబ్లీకి నివేదించుటకుగాను సాధ్యమైనంత త్వరలో ద. ఆఫ్రికా ప్రభుత్వము ఒక ధర్మకర్తృత్వ ఒడంబడికను తయారుచేయవలెనని, ఆ తీర్మానము రెండవసారి ఉద్ఘాటించెను. తీర్మానమునకు తీవ్రమైన ప్రతిఘటన యుండినప్పటికి అప్పుడు ద. ఆఫ్రికాలో అధికారములో నుండిన స్మట్సు ప్రభుత్వము కొన్ని వాగ్దానముల నొసంగెను. నైరుతి ఆఫ్రికాను ద. ఆఫ్రికాలో కలుపుకొను పనులు సాగింపమని వారు హామీ యిచ్చిరి. మాండేటరీ రాజ్యమును పరిపాలించినట్లే తాము నైరుతి ఆఫ్రికాను పరిపాలింతురని ఐక్యరాజ్యసమితికి నివేదిక సమర్పింతురని వారు హామీయిచ్చిరి. ఈ తీర్మానము 1947 సం॥ములో ఆమోదింపబడెను. అప్పటికి యిప్పటికి పరిస్థితులు చాలా మారినవి. ధర్మకర్తృత్వసంఘ ప్రశ్నలకు దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వము పంపిన సమాధానములు అయోగ్యములైనవిగా నున్నవనుట కెట్టి సందియమును లేదు. అపర్యాప్తములగు ఈ సమాధానములపై ధర్మకర్తృత్వ సంఘము తెలిపిన అభిప్రాయము ఆందోళనకు కారణమగుచున్నది.

### ప్రజల ఆర్థికస్థితి

రత్నములు, చర్మములు బాగా అమ్మకమగుచుండుటవల్ల నైరుతి ఆఫ్రికా ఆర్థికస్థితి చాల వృద్ధియయ్యెనని ధర్మకర్తృత్వ సంఘము వ్యాఖ్యానించిరి. కాని వృద్ధి పొందినది యెవరి ఆర్థికస్థితి? మొత్తం ప్రజలదా? లేక 100 కి పదివంతులుగా నున్న ఐరోపియనులదా? గొర్రె చర్మాల అమ్మకములపై విస్తారముగా లాభములు పొందబడుచుండగా గొర్రెలను కాచు ఆఫ్రికనుల కూలీ మాసమునకు 9,10 షిలింగులుగా నున్నది. ఆ ప్రాంతపు ఆర్థికస్థితి విషయమై విచారించునప్పుడు సభవారు ఒక ముఖ్య విషయమును, అనగా భూమిపంపకమునకు సంబంధించిన విషయమును విచారింపవలెను. అచ్చట మొత్తము నాలుగుకోట్ల 77 లక్షల హెక్టర్ల భూమియున్నది. దానిలో 2 కోట్ల 78 లక్షల హెక్టర్లు ఐరోపియనుల క్రింద నున్నది. ఒక కోటి 87 లక్షల హెక్టర్లు తక్కినవారి క్రిందనున్నది.

హెరేరోజాతివారికి అచ్చటచ్చట 8 రిజర్వులలో వసతి కల్పించియున్నారని ధర్మకర్తృత్వసంఘము గుర్తించినది. ఆ ప్రాంతమునందలి గోశముల సాంఘిక క్షేమము వకై ఖర్చుపెట్టబడుచున్న ద్రవ్యము విషయమై నాలుగుమాటలు చెప్పదగును. ఇందు విషయమై ధర్మకర్తృత్వ సంఘమువారు వ్యాఖ్యానించియున్నారు. 1946-47 సం॥ములో విదేశీయులపై వెచ్చింపబడిన ద్రవ్యము 100 కి 10 వంతులు మాత్రమే. దేశీయులు 100 కి 90 వంతులుగా నున్నారు. నైరుతి ఆఫ్రికాలో 1946 సం॥పు లెక్కల ప్రకారము పోలీసు ప్రాంతమునందలి రిజర్వులలో జననములకంటె మరణములే హెచ్చుగానున్నవి. కంపెనీల, నిర్మాణమునకు, ప్రయివేటు వ్యక్తుల యిండ్లు మున్నగువాని నిర్మాణమునకు, పబ్లిక్ వర్క్సు నిర్మాణమునకు ప్రతి ఉదయము విండోక్ వంటి పట్టణములో వందలకొలది స్థానికులను కూలి పనులకుగాను పోలీసు కాపలా క్రింద తీసికొనిపోవుట గాంచవగును. కార్మిక ప్రమాణములు నైరుతి ఆఫ్రికాలో నత్యంత హీనముగా నున్నవి... ద. ఆఫ్రికా అవలంబించుచున్న ఈ విధానమువల్ల దేశద్రిమ్మరులు, భూమిలేనివారు, నైపుణ్యములేనివారునగు కూలీలసంఖ్య నానాటికి హెచ్చుచున్నది. ఒకానొక సమయమున గర్వముగా తలయెత్తుకొని తిరుగ గలిగినవారు, ఆత్మగౌరవం కలిగియుండినవారు యిప్పుడు నైతికముగా పతనము నొందియున్నారు.

నానాజాతి సమితి అస్తమయముతో మాండేటు దేశమైన నైరుతి ఆఫ్రికాపై ద. ఆఫ్రికాకు సంరక్షణాధికారము సంక్రమించెనని ద. ఆఫ్రికా ప్రతినిధి వాదించియున్నాడు. ఇది కేవలము భ్రమయని మా రాయబారవర్గమువారు నమ్ముచున్నారు. తన ప్రభుత్వమునకు నైతిక బాధ్యత యున్నదను విషయమును ద. ఆఫ్రికా ప్రతినిధి అంగీకరింపకున్నాడు. అతనిట్లు చెప్పుట ద. ఆఫ్రికా నిరాకరించుచున్న ఈ నైతికబాధ్యత ప్రపంచ ప్రజల సమిష్టి ధర్మనిరతియొక్క ఆవిష్కరణమే గాని అన్యము కాదు. ఈ ఆవిష్కరణము ఐక్యరాజ్యసమితిద్వారా జరుగుచున్నది. ఇట్టి పదమునకు విలువ యేమియు లేనియెడల మన సంస్థ పునాదులకే విఘాతము కలుగును"

శ్రీమతి విజయలక్ష్మి ఉపన్యాసము ముగించగానే ప్రతినిధులు ఆమెను చుట్టుముట్టిరి. ఆమెకరచాలనము గావించుటకు వారు తమ స్థానములనుండి పరుగుపరుగున వచ్చిరి. ఉపన్యాసముయొక్క ప్రతులను తను కొసంగవలెనని చాలామంది ఆమెను ప్రార్థించిరి.

### బ్రిటిషు ప్రతినిధి ప్రసంగము

ధర్మకర్తృత్వమునకు సంబంధించిన ప్రణాళిక షరతులను వ్యాఖ్యానము చేయునప్పుడు వివేకము చూపవలెనని బ్రిటిషు ప్రతినిధి గార్డన్ వాకర్ చెప్పెను. వానిలో లేని అర్థములీయుట ప్రమాదకరమగును. నైరుతి ఆఫ్రికాకు ధర్మకర్తృత్వ ఒడంబడిక తయారు చేసి సమర్పించవలసిన బాధ్యత ద. ఆఫ్రికాకు లేదని, ఇదివరలో బ్రిటన్ పాలనము క్రింద నుండిన మాండేట్లకు బ్రిటను ధర్మకర్తృత్వ ఒడంబడికలను సమర్పించెను. గాని, అది తాము స్వేచ్ఛగా చేసినదేగాని, న్యాయశాస్త్రరీత్యా తమ కట్టిబాధ్యత లేదంటె నతడు.

### చైనా ప్రతినిధి

ధర్మకర్తృత్వము క్రింద నున్న దేశములకు సంబంధించిన ప్రణాళిక షరతులను అనేక విధములుగా వ్యాఖ్యానము చేయవీలగునని చైనా ప్రతినిధి లియూ చేగారు చెప్పుచు ఈ షరతులకు వివేకవంతమైన వ్యాఖ్యానము చేయవలసిన యెడల నైరుతి ఆఫ్రికాను ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వము క్రింద నుంచుటే సరియైనదని చెప్పెను. సభ రేపటివరకు వాయిదా పడినది.

# మదరాసు రేడియో

## నవంబరు 13 శనివారం

మదరాసు (2)

ఉ. 7-0 స్వాగతం. 7-10 తె. వార్తలు. 7-30 ఎస్. సుస, జయలక్ష్మి, పాట. 8-0 ఇ. వార్తలు. 8-30 బాలానందం. 1-0 మహిళామండలి. ఆకాశజ్యోతి. కాంతు సంగీత నాటిక. ఆధారము వేదులవారి దీపావళి. సమీకరణ-సుబ్బు అగ్నిప్రమాదములు ప్రథమ చికిత్స. 1-30 ఇ. వార్తలు. 2-5 తె. వార్తలు. 2-15 శిశువులకు ... 4-0 బిడ్డలకు, ఇంగ్లీషులో. 4-30 ఇ. వాయిద్యం. 5 30 చి. ఎ. కామేశ్వరశర్మ, ఫిడేలు. 6-0 ఇ. వార్తలు. 6-30 గ్రామస్థుల కార్యక్రమము. జమీందారీ రద్దుబిల్లు, ప్రసంగం. మీరా భజన. వినోదాలేమిటి. 7-15 తె. వార్తలు. 7-20 దేశను రోజులలో అభ్యాగతి రాక-క. చి. వెంకట్రావు గారి ప్రసంగం. 7-45 చెంబై వైద్యనాథ భాగవతారు, పాటకచేరి. 9-0 ఇ. వార్తలు 9-15 మీరే చేసుకోండి. ఇ. ప్రసంగం. 9-40 వాయిద్యం. ఇతర వేళలందు రికార్డులు.

## గాంధి హత్యకేసు:

# "నా తరపున సాక్ష్యం తీసికొని రాదలంచ లేదు"

## న్యాయమూర్తి ప్రశ్నలకు నాథూరాంగాడ్సే ప్రత్యుత్తరములు

న్యూఢిల్లీ, నవంబరు 10: గాంధీహత్య కేసు విచారణ నేడు తిరిగి లాల్‌ఖిల్లాలో ప్రారంభమైనపుడు ప్రధాన ముద్దాయి నాథూరాంగాడ్సేను ప్రత్యేకజడ్జి ఆత్మచరణ్ తిరిగి క్రాసుపరీక్ష చేసెను.

ప్రశ్న:- మెరీనా హోటల్‌లో జనవరి 20వ తేదీన కర్కారే, శంకర్, ఆప్టేలతో కలసి నీవు టీ పుచ్చుకొంటివా? నీ గదిలో (నెం. 40) కర్కారేకు జనవరి 17, 18 తేదీలలో విదేశీ విస్కీని ఇచ్చితివా?

జవాబు:- జనవరి 20వ కర్కారే, శంకరులు మెరీనా హోటల్‌కు రాలేదు. నేను టీ తెప్పించలేదు. నేనెప్పుడూ టీ త్రాగను. కాఫీ మాత్రము పుచ్చుకొందును. కర్కారేకు నేను విస్కీ ఇప్పించలేదు. నాగదిలో ఎప్పుడూ ఎవరికీ విస్కీలాంటి పదార్థాలు ఇవ్వబడలేదు. నేను విస్కీ త్రాగను. నేను కర్కారేను మెరీనాహోటల్‌లో ఎప్పుడూ చూడలేదు.

మరొక ప్రశ్నకు సమాధానంగా గాడ్సే ఇట్లా అన్నాడు:- మెరీనాహోటల్ సాక్షులను గూర్చి నేను చెప్పేదేమీ లేదు. జనవరి 20వ తేదీన బిర్లాభవనంలో నన్ను చూచినామని సాక్ష్యం చెప్పిన సులోచన, సోతూరాంలకు నేను తుగ్లక్ రోడ్డు పోలీసు స్టేషనులో గుర్తింపు కొరకు చూపింప బడితిని. సూర్జిత్ సింగు (టాక్సీడ్రైవరు)ను కూడ అక్కడే నేను చూచితిని. ఒకసారి అతడు నాకెదురు ముందు నిలబడి నావంక తేరిపార చూచుచుండెను. నేను "సర్దార్ సాహెబ్! నీకేమి కావాలి" అని అడిగితిని "ఏమీలేదు", అని అతడన్నాడు.

నేను నేరమును ఒప్పుకో గోరుచున్నందున ఢిల్లీలోని మేజిస్ట్రీటుకు ఎప్పుడూ ఏ అభ్యంతరమునూ చూపలేదు. కుట్ర ఆరోపణకూడా నాపై ఉన్నదని నేనెరుగను.

ఢిల్లీలో గుర్తింపు విన్యాసములు జరిగినప్పుడు నాతలపై కట్లున్నవి. నాకిష్టం లేకపోతే వానిని తీసివేయవచ్చునని మేజిస్ట్రీటు నాకనుమతి ఇచ్చినాడు. భరవాలేదని నేనన్నాను. నాతోపాటు ఉన్న ఇతరులను తలపై రుమాల్లు చుట్టుకో వలసినదని మేజస్ట్రీటు కోరెను. రసుమారు 4గురు ఆపైన చుట్టుకొన్నట్లు నాకు జ్ఞాపకం. నా తలపై కట్టు కూ, వారిరుమాళ్లకట్టుకూ చాలా తేడా ఉన్నది.

ఒక ఢిల్లీ పోలీసు ఉద్యోగితో కలసి నన్ను చూడవచ్చిన జానూ అనే సాక్షిపై నేను చెప్పవలసినదేమీ లేదు.

ఛూర్‌సింగు, గరీబా, జుమ్మాలనే సాక్షులకూ నేనుచూపింప బడినట్లు జ్ఞప్తి లేదు. పోలీసులు తలుచుకుంటే నాకు తెలియకుండానే సాక్షులు నన్ను చూడ గలుగుదురు. బొంబాయిలో జరిగిన గుర్తింపు విన్యాసములు సక్రమముగనే ఉన్నవి.

పోలీసులు కొందరు సాక్షులకు నన్ను ముందుగానే చూపించినట్లు అనుమానంగా ఉన్నదని నేను బొంబాయి ప్రధాన మేజస్ట్రీటు అస్కార్షానుతో చెప్పితిని. క్రాసు పరీక్ష సమయములో ఈ ప్రశ్ను వేయమనీ, అతడు నాకు జవాబిచ్చెను.

ముగ్లక్‌రోడ్డు పోలీసుస్టేషనులోని తన ఖైదుగదిని గూర్చి చెప్పుచు గాడ్సే ఇట్లా అన్నాడు. "నా గది ముందు పోలీసులు ఒక కంబళీని కప్పి ఉంచేవారు. ఎవరైనా అధికారి వచ్చినప్పుడు సగంగాని పూర్తిగాగాని కంబళీ ఎత్తివేసి నన్ను ప్రదర్శించేవారు. కంబళీ ఎప్పుడూ మూసియే ఉంచవలసినదని అధికారులకు ఆజ్ఞలివ్వబడినవట.

న్యాయమూర్తి: మీ స్వదస్తూరీ నమూనాలు కొన్ని మీ వద్దనుంచి తీసికొనబడిన మాట నిజమేనా?

నాథూరాం గాడ్సే: కోర్టులో దాఖలు చేయబడిన ఎగ్జిబిట్ల మీది సంతకములు నావే. మరాటీ భాషలో నన్ను దస్తూరీ నమూనాకు కొన్ని పంక్తులు వ్రాయుమన్నారు. గీతలు గీసికొన కుండానే నేను వ్రాయుట కారంభించితిని. గత రెండు సంవత్సరములనుండియు నేను ఆ విధంగానే వ్రాయుచుంటిని. అటుపిమ్మట గీతలమీద నన్ను వ్రాయమని కోరిరి;

ప్రశ్న: "నీకు వ్యతిరేకంగా ప్రాసిక్యూషను తరపు సాక్షులు చెప్పిన విషయములను గూర్చి మీరు ఏమైన చెప్పెదరా? వారందరు మీకు వ్యతిరేకంగా ఎందుకు సాక్ష్యమిచ్చిరో సూచించెదరా"

జవాబు: ప్రాసిక్యూషను తరపు 39 సాక్షియైన జగదీశ ప్రసాదు గోయాలును నేను ఎప్పుడూ చూచియుండ లేదు. ఖాను సాహెబు ఉమాల్‌ఖాను ఆ సాక్షిని నా యెదుటకు తీసికొని వచ్చెను. ఏ పిస్తోలుతో నేను గాంధి మహాత్ముని కాల్చి చంపితినో ఆ పిస్తోలు యితనిదే అని ఖాను సాహెబు నాతో చెప్పెను. నీవు నిజం మాట్లాడు. నిజం తప్ప అన్యథామాట్లాడవద్దని ఆ మనిషితో నేను అన్నాను. అటు పిమ్మట నన్ను అతని ఎదుట లేకుండా తీసికొని పోయినారు. మధుకర కేశవకాలే మీద (ప్రాసిక్యూషను తరపు 50 సాక్షి మీద) గ్వాలియరు పోలీసులు కొంత ఒత్తిడి చేసి నాకు ప్రతిమాటగా సాక్ష్యం ఇవ్వవలసినదిగా నిర్బంధించి ఉంటారు. ప్రాసిక్యూషన్ సాక్షియగు దాదా మహారాజ్‌తో నేను చాలా స్నేహంగానే ఉంటూ ఉండే వాడిని. కాని దీక్షిత మహారాజుతో నాకు సాధారణ పరిచయము మాత్రమే కలదు. వారిద్దరు యీ కేసులో నాకు ప్రతికూలముగా సాక్ష్యం చెప్పకపోతే, తమకు ఏదైనా చిక్కులు కలుగునవే కారణం చేతను, గాంధీ మహాత్ముని నేను హత్య చేయుట వారికి యిష్టము లేకపోవుటవల్లను వారిద్దరు నాకు ప్రతికూలంగా సాక్ష్యం చెప్పియుంటారు. 29 సాక్షి వసంత గజానన్ జోషీ బొంబాయి పోలీసువారి ఒత్తిడి మూలంగానే నామీద సాక్ష్యం చెప్పిఉంటాడు. బొంబాయి పోలీసు డిప్యూటీకమీషనరు డి. నగర్వాలాగారికి, గాంధీ హత్యకేసులో ప్రధానదర్యాప్తు ఆఫీసరుకు, ఢిల్లీ సి. ఐ. డి. పోలీసు శాఖలో డిప్యూటీ ఇనస్పెక్టరు జనరలగు రాయిసాహెబు ఋషీకేశ్ గారికి యీ దర్యాప్తు లందును కేసు విచారణయందును వారు నా యెడ చూపిన మర్యాదకు నేను కృతజ్ఞతా వందనము లాచరించుచున్నాను.

న్యాయమూర్తి: మీ తరఫున మీ కేసు బలపరచుకొనుటకు ఏమైనా సాక్షులను తీసికొని వచ్చెదరా?

నాథూరాం గాడ్సే: నా కేసును బలపరచుటకు నేను సాక్షులను ఎవరినీ తీసుకొని రాదలచలేదు.

న్యాయమూర్తి: అప్రూవరుగా కేసు నంతను బయటపెట్టిన దిగంబర బాడ్గేగారు మీకు ప్రతికూలంగా ఎందుచేత సాక్ష్యమిచ్చిరో చెప్పగలరా?

నాథూరాం గాడ్సే: బాడ్గే ఆయుధాల వ్యాపారం చేస్తూఉండేవాడు. ఆ సంగతి అంతా నాకు తెలుసు. రెండు మూడు సందర్భములలో బాడ్గే నాకు ఆయుధములు సప్లయి చేయడమో, నేను అతనికి సప్లయి చేయడమో హైదరాబాదు సంస్థాన వ్యవహార సందర్భములో జరిగింది. ఒకొక్కసారిగా వంద రూపాయీలకు తక్కువ కాని మొత్తములను అతను నన్ను అడిగి తీసుకొనడం ఆరంభించాడు. ఇదంతా చూస్తే నన్నేదో అల్లరిపాలు చేయడానికే అని నాకు తోచినది. బొంబాయి పోలీసులు గాంధీ మహాత్ముని హత్యానంతరము బాడ్గెను అరెస్టు చేసిరి. బొంబాయి పోలీసులు అతనిని చాలా బాధించిరి. పీడించిరి. గాంధిమహాత్ముని హత్యానంతరము మహారాష్ట్ర బ్రాహ్మణులగూర్చి బొంబాయిలోని కొన్ని పత్రికలు చాలా అల్లరిగా ప్రచారము చేసెను. ఆ కారణం వల్ల నాకు ప్రతికూలంగా బాడ్గే సాక్ష్యమిచ్చియుండునని ఊహిస్తాను.

న్యాయమూర్తి: ఈ కోర్టువారియెదుట మీరు ఇంకా ఏదైనా విషయాలు చెప్పగోరెదరా?

గాడ్సే: కోర్టులో దాఖలుచేయబడిన రెండు మూడు ఉత్తరాలనుగూర్చి చెప్పదలంచితిని. ఆ ఉత్తరములలో ఒకటి నేను సవర్కారుగారికి 1938 సం॥లో వ్రాసినట్టిదై యున్నది. రెండవది, ఆప్టేగారికి ఢిల్లీనుంచి 30-1-48 తేదీని వ్రాసినదైయున్నది. ఆ ఉత్తరంతోబాటు నా ఫోటోనకూడా ఆప్టేకు పంపితిని. ఆ ఫోటోను నేను ఢిల్లీలో జనవరి 30 తేదీని తీయించుకున్నాను. అంతకుపూర్వము నేను ఫోటో ఎప్పుడు తీయించుకోలేదు. నన్ను నా మిత్రులు జ్ఞాపకముంచుకొనేనిమిత్తమై నేను యీ ఫోటోను పంపితిని.

### ఆప్టేగారి వాఙ్మూలము

గాంధీ హత్యకేసులోని ఒక ముద్దాయియగు నారాయణ దత్తాత్రేయ ఆప్టేగారు నేడు కోర్టువారికి 22 పుటలుగల వాఙ్మూలమును దాఖలు చేసిరి. ఆవాఙ్మూలములో యీక్రింది విషయములను వివరించిరి.

నామీద ఆరోపింపబడిన నేరములను దేనిని నేను చేయలేదు. ఇతర ముద్దాయీలతో కలిసి నేను ఏవిధమైన కుట్రలు చేయలేదు. ఇతర ముద్దాయీలు నేరాలు చేయుటకు నేను వారికి తోడ్పడియుండ లేదు. గాంధిమహాత్ముని హత్యచేసేవిషయములో ముద్దాయీలమధ్య ఒడంబడిక ఏమీ జరిగియుండలేదు. ప్రాసిక్యూషను తరపు సాక్ష్యమువల్ల నామీద ఆరోపింపబడిన నేరములు ఋజువు అగుటలేదు.

నామీద దొంగ సాక్ష్యమును విశేషంగా బనాయించి సృష్టిచేసిరి సాక్షులకు పాఠం చెప్పి సాక్ష్యమిప్పించిరి. నేను కుట్రలు చేసినాననే నేరమును ఋజువుచేయుటకై నిరాధారములైన విషయాలు అనుమాన హేతువులైన విషయాలు అనేకం యీ కోర్టువారియెదుట సాక్షులచేత చెప్పింపబడెను. 20-1-48 తేదీ ప్రాంతంలో గాంధిమహాత్ముని చంపవలెననే కుట్ర ఏమిన్నీ జరిగియుండలేదు. బాంబును పేల్చుట విషయంలోగాని, గన్‌కాటన్ పేల్చుట విషయములోగాని నాకు సంబంధమేమియులేదు. బిర్లా భవనంలో 30-1-48 తేదీని జరిగిన హత్య విషయంలోకూడా నాకు ఏమిన్ని సంబంధంలేదు. ఆ విషయములకు సంబంధించిన సాక్ష్యం అంతా అబద్ధం. సాక్షులు చెప్పిన మిగతా విషయాలు హైదరాబాదులోని ఉద్యమానికి సంబంధించినవై యున్నవి. అవికూడా చాలా కల్పనలతో మెరుగు పెట్టినవై యున్నవి.

నేను బొంబాయి విశ్వవిద్యాలయంలో సైన్సు చదివి పట్టభద్రుడనైతిని. టీచర్సు ట్రెయినింగు ప్యాసయి 7 సం॥ అహమ్మదునగరులోని అమెరికను మిషను హైస్కూలులో టీచరుగా పనిచేసితిని. అహమ్మదునగరులో నేను హిందూమహాసభలో సభ్యుడునుగా చేరితిని. హిందూవిజ్ఞాన సంస్కారము పెంపొందుటకై రక్షింపబడుటకై హిందూసంఘం ఏకమై బలవత్తరం కావలెనని నా కోరిక. గాంధి మహాత్ముని అహింసా సిద్ధాంతమువల్ల సంఘం అభివృద్ధిలోనికి రాదని నానమ్మకము. గాంధీజీతో నాకుగల వివాదము ఈ సిద్ధాంతముల విషయములోనే. వ్యక్తిగతంగా ఆయనతో నాకెట్టి తగాదాయున్ను లేదు. ఆయన శరీరానికి హాని కలుగచేయవలెననే అభిప్రాయము నాకెప్పుడూ లేదు. విదేశీయుల దౌర్జన్యములనుండియు, అన్యమతస్థుల దౌర్జన్యములనుండియు హిందువులు తమ్ము తాము రక్షించుకొనుటకు సమర్థులు కావలెనని నామతము. అట్టి శస్త్రబలవిశ్వాసముతో రైఫిల్ క్లబ్బులను ఏర్పాటు చేయవలెననే అభిప్రాయము నాకు 1938 సం॥లో కలిగెను. యువకులైన మహారాష్ట్రులకు ఆత్మరక్షణార్థమై ఆయుధాలను ఉపయోగించుట నేర్పే నిమిత్తమే యీ రైఫిల్‌క్లబ్బులు ఉద్దేశింపబడినవి. ఈ ఉత్సాహమును నేను కనబరచుటవల్ల 1943 జనవరిలో నన్ను అసిస్టెంటు టెక్నికలు రిక్రూటింగు ఆఫీసరుగా యుద్ధకాలమందు గవర్నమెంటు నియమించిరి. ఇండియను విమానదళములో నాకు కింగ్సు కమీషను ఉద్యోగి హోదాకూడా ఇచ్చిరి. నాతండ్రి మరణమువల్ల ఒక సంవత్సరానంతరం నేను ఆపదవిని విడనాడితిని.

నాథూరాం వినాయకగాడ్సేను నేను 1941 సం॥లో హిందూమహాసభ ప్రచారకునిగా పూనాలో చూచియుంటిని. మేమిద్దరము "అగ్రణి" అనే పత్రికను 1944లో ప్రారంభించితిని. హిందూమహాసభ నాయకుల అభిప్రాయములను హిందూమహాసభయొక్క రాజకీయ కార్యవిధానమును ప్రచారము చేయుటకు యీ పత్రికను ప్రారంభించితిమి. భారతదేశమును విభాగంచేయు విషయములోను గాంధి మహాత్ముడును, కాంగ్రెసు సభయున్ను ముస్లిములయెడ చూపుచున్న అభిమానం విషయములోను హిందూమహాసభయొక్క ప్రతికూల భావములను వెల్లడించుటకే పత్రికను ప్రారంభించితిమి. గాంధీజీ అభిప్రాయములను ఖండించుటకై ఆయనయొక్క ప్రార్థనా సమావేశములందు మేము ప్రతికూల ప్రదర్శనములను చేసితిమి. పంచాగ్నివద్ద 1944 సం॥ములో గాంధి ప్రార్థనా సభయందున్ను 1946 సం॥లో ఢిల్లీలో మరొక సందర్భంలోను నేను స్వయంగా కొన్ని ప్రతికూల ప్రదర్శనములను జరిపియుంటిని. ఈ ప్రతికూల ప్రదర్శనములందు ఒక ఉపన్యాసమును చదువుటయున్ను గాంధీజీని కొన్ని ప్రశ్నలడుగుటయును జరిగెను. దేశవిభజన విషయములోను ముస్లిములయెడల చూపబడుచున్న ప్రత్యేకాభిమాన విషయములోను ప్రశ్నలడుగబడెను. గాంధీ ప్రార్థన సభలో ఏర్పాటు చేయబడిన మైక్రోఫోనుద్వారా (శబ్దవిస్తరణిద్వారా) నేనుకూడా ఉపన్యసించేవాడిని. మావెంటవచ్చినవారు అనేక నినాదాలుచేసి కేకలు వేయుటకూడ జరిగేది.



వాయులీనాచార్య ద్వారం వెంకటస్వామినాయుడుగారికి విజయవాడ హిందూస్థాన్ సంగీతనుండలివారు తమ నాల్గవ వార్షికోత్సవములో సన్మానపత్రం సమర్పించినప్పటి చిత్రము.

ఆప్టే తన 23 పుటల వాఙ్మూలమును చదువుటకు ఒక గంటసేపు పట్టెను. రేపు తిరిగి కోర్టు సమావేశమగును. అప్పుడు న్యాయమూర్తి ఆప్టేను కొన్ని ప్రశ్నలడిగి పరీక్షచేయును.

### హైదరాబాదు సంఘటనము

15-8-47 తేదీని భారతదేశం విభజింపబడిన పిమ్మట పంజాబు వగైరా రాష్ట్రములలోను హైదరాబాదులోను జరిగిన దారుణహత్యలు ఘోర కార్యములు హిందూమహాసభవారిని చాలా ఉద్రేకింపజేసినవి. ఇండియా గవర్నమెంటు ఏమీ చేయలేని అశక్తస్థితిలో ఉన్నదని తలంచితిమి. హైదరాబాదులోని హిందువులను రక్షించుట అవసరమని తలంచితిమి. అచటి హిందువులకు ఆయుధములను సప్లయి చేయుట సహకార్యమని నేను తలంచితిని. అప్రూవరు బాడ్గేతో సహా ఈ కేసులోని సాక్షులు చెప్పిన సాక్ష్యములోని విషయములు అబద్ధాలతో నిండియున్నవి. పాకిస్థానుకు ఇండియా ప్రభుత్వము రూ. 50 కోట్ల రూపాయీలను యివ్వకపోవుటవల్ల 13-1-48 తేదీని గాంధీజీ ఉపవాసదీక్ష బూనెను. ఇటువంటి అసమంజసమైన సత్యాగ్రహం ఆయనచేయుట తగదని అభిప్రాయముచేస్తూ బహిరంగ ప్రదర్శనం ఢిల్లీలో చేయవలసి యున్నదని తలంచితిని. ఈ విషయమై గాడ్సేతో చర్చించితిని. ఢిల్లీలో ప్రశాంతంగా యీ విషయమై గాంధీ ప్రార్థనా సమావేశంలో ప్రతికూల ప్రదర్శనం జరుపుటకు నిశ్చయించితిమి.

17-1-48 తేదీని నేనున్ను గాడ్సేయున్ను సవర్కారువద్దకు వెళ్ళియుండలేదు. "మీరు మీ పని జయప్రదంగా చేసికొని రండి" అని సవర్కారుగారు మా ఇద్దరితో తన యింటిమెట్లమీదనుండి మాతో అనడంకూడా జరిగియుండలేదు. 17-1-48 తేదీని బాడ్గేతో కలిసి నేను దీక్షిత మహారాజువద్దకు వెళ్లుటగాని, ఒక రివాల్వరును యివ్వవలసినదిగా అడుగుటగాని 20-1-48 తేదీని బాడ్గేతో కలిసి బిర్లాభవనమునకు పోవుటగాని జరుగలేదు. ప్రతికూల ప్రదర్శనం జరుపుటకు వీలున్నదేమో చూడవలెనని 20-1-48 తేదిని గాంధీప్రార్థనా సమావేశానికి నేను వెళ్లియుంటిని. అచట సభలో అమర్చబడిన శబ్దవిస్తరణి (మైక్రోఫోను) సరిగా పని చేయడంలేదు. అందువల్ల నా ప్రతికూల ప్రదర్శన సాధ్యపడలేదు. అంతట నేను బిర్లాభవనమునుండి వెళ్లిపోతిని. అటుపిమ్మట అక్కడ ఏదో ప్రేలుడువస్తువు ప్రేలిన కారణంవల్ల మదన్‌లాలు అరెస్టు చేయబడెనని నాకు తెలిసినది. మదన్‌లాలువద్దనుండి పోలీసువారు తమకు కావలసిన సంజాయిషీలను రాబట్టుటకు ఎంతమాత్రమూ వెనుదీయరని నేను ఊహించితిని. నన్నుకూడా ఢిల్లీలో పోలీసులు వెంటనే అరెస్టుచేసినట్లయితే ఇక ప్రతికూల ప్రదర్శనాలు చేయుట కవకాశముండదని యెంచి నేను వెంటనే ఢిల్లీనుంచి బొంబాయికివెళ్లి గాడ్సేనుకలిసికొన్నాను. ఉభయులము పరిస్థితులను విమర్శించి చర్చించితిమి. త్వరలోనే మేముకూడా అరెస్టు చేయబడగలమని భావించితిమి. కనుక ఢిల్లీలో ఒక ప్రతికూల ప్రదర్శనం త్వరగా జరుప గోరితిమి. కాని యీ ప్రదర్శనం జరుపుటకు వాలంటీర్లను సమకూర్చుట కష్టమైనపని. ఈ వాలంటీర్లను బొంబాయినుండి ఢిల్లీకి తీసికొనిపోవుటకు మావద్ద పైకంలేదు. గ్వాలియరులో నున్న పరచూరెగారు సహాయం చేస్తాడని తలంచితిమి. అందువల్ల గ్వాలియరు వెళ్ళినాను. ఈ విషయమై గాడ్సేతో చెప్పితిని. కాని అతడీ విషయంలో శ్రద్ధ కలుగజేసికోలేదు. కాని నాతో గ్వాలియరుకు వచ్చుటకు అంగీకరించెను. కొన్ని దినాలుగా గాడ్సే ఏదో దీర్ఘాలోచనా నిమగ్నుడై ఉంటూఉండేవాడు. పరధ్యానంగా ఉంటూఉండేవాడు. నేను జరుపవలంచిన ప్రతికూల ప్రదర్శనముల విషయంలో అతడు ఆసక్తి చూపలేదు. నేను గాడ్సే కలిసి 27-1-48 తేదీని విమానం మీద ఢిల్లీకి వెళ్లితిమి. అచటినుండి గ్వాలియరుకు వెళ్లి పరచూరెను కలిసికొని వాలంటీర్లు కావలెనని చెప్పితిని. తన వాలంటీర్లు చాలామంది అరెస్టు అయినారనిన్ని కొందరు పారిపోయి దాగియున్నారనిన్ని అతడు చెప్పెను. బొంబాయికి వెళ్ళి వాలంటీర్లను తీసికొని వద్దామని గాడ్సే నాతో అన్నాడు. నేను బొంబాయి వెళ్ళి వాలంటీర్లను తెస్తానన్నాను. 29-1-48 తేదీని నేను బొంబాయికి వెళ్ళితిని. గాడ్సే ఢిల్లీకి వెళ్ళినాడు. 30-1-48 తేదీని గాంధీ హత్యసందర్భములో గాడ్సే అరెస్టు చేయబడెనని నాకు వినవచ్చెను. అతనికి సహాయం చేస్తే బాగుండునని అనుకున్నాను. కాని అది అవివేకమైనపనియని తర్వాత గ్రహించి నేను ఆ పని చేయలేదు. కొంతకాలం వరకు నేను అనిశ్చితావస్థలోనే ఉన్నాను.

2-2-48 తేదీని పూనాలో నేనుండగా 30-1-48 తేదీగల ఉత్తరమొకటి నాకు ఢిల్లీనుంచి వచ్చింది. ఈ ఉత్తరంలో గాడ్సే ఫోటో కలదు. బొంబాయి నుంచిగాని పూనా నుంచిగాని వాలంటీర్లను తీసికొని రానక్కరలేదనియు, వాలంటీర్లు లేకనేవుండి లేని కారణమువల్లనే ప్రతికూల ప్రదర్శనము నిరుపయోగమగుచున్నదనియు తన మనస్సు చాలా ఉద్రేకపూరితమై యున్నదనియు ఏదో అఘవ ప్రతిక్రియ తాను చేయదలంచితి ననియు ఆ ఉత్తరములో అతడు వ్రాసెను.

31-1-48 తేదీ నుండి 14-2-48 తేదీ వరకు నేను పూనాలోను నా స్నేహితుల ఇండ్లలోను ఉంటూవున్నాను. 14-2-48 తేదీని నన్ను అరెస్టు చేశారు. ఆ కాలంలో నేను హోటళ్లలో ఉన్నప్పుడు నేను హోటళ్ల రిజిష్టరులందు నా పూర్తి పేరును వ్రాస్తుండే వాడను కాను. నేను వేరే మారు పేరుతోనే వ్రాస్తు ఉండేవాడిని. అయినా నేను వ్రాయడం నా జాగ్రత్త కోసం చేస్తు ఉండేవాడిని. నామీద ఆరోపింపబడిన నేరములను ప్రాసిక్యూషను తరపు సాక్ష్యం ఋజువు చేయలేక పోయెను. నేను పూర్తిగా నిరపరాధిని. కనుక నన్ను విడిచిపెట్ట వలసినదని కోర్టువారిని ప్రార్థించుచున్నాను.

## గంటల పంచాంగం

సర్వధారి నం॥ కార్తీక శు ఏకాదశి 1948 నం॥ నవంబరు 12 శుక్రవారం శు ఏకాదశి సా6-55 పూ-భా ప7-37 వర్జ్యం సా 6-16 ల8-2 వ.

శు॥ ద్వాదశి నవంబరు 13 శనివారం శు ద్వాదశి రా8-55 ఉ-భా ప10-16 వర్జ్యం రా 11-24 ల 1 8 వ.


# ఆంధ్రపత్రిక

సర్వధారి నం॥ కార్తీక శు॥ ఏకాదశి శుక్రవారం


## రైల్వే కార్మికులబాధ్యత

ద్వితీయ ప్రపంచసంగ్రామము పరిసమాప్తమై నాలుగు సంవత్సరములైనప్పటికిని, సంగ్రామ ఫలితములనుండి ఇంతవరకు ఏ దేశము విముక్తి పొందియుండలేదు. ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగములందు అన్ని దేశములు దాదాపు ఒకేవిధముగు సమస్యలను ఎదుర్కొనుచుండెను. యుద్ధకాలమున అవసరము అధికమగుటచే ప్రతి దేశములోను ప్రభుత్వము చలామణియందున్న ధనమును ఒక పరిమితిఅనునది లేక వృద్ధిచేసుకొనెను. యుద్ధ నిర్వహణ ఖర్చు అధికముగ నుండిన, యుద్ధానంతరము నిర్మాణ, పునర్నిర్మాణములకు చేయవలసిన ఖర్చు అత్యధికముగ నుండెను. వ్యయవిధానము, ఖర్చుచేయు పద్ధతులు మారియుండెనే గాని ఖర్చు చేయవలసిన మొత్తమును తగ్గించుట కేంద్రప్రభుత్వమునకును సాధ్యముగాకుండెను. ఈ స్థితిలో తృతీయ ప్రపంచ సంగ్రామ ప్రస్తావన వచ్చుచున్నందున, జాతీయ పునర్నిర్మాణ పథకములతోబాటు, యుద్ధనిర్వహణ కలాపములను వృద్ధిచేసుకొనుట అవసరమైనది. ప్రజల కవసరమైన వాడుక వస్తువుల ఉత్పత్తి ఇప్పటికిని పరిమితముగనే యున్నది. ప్రజల అవసరములు పెరిగినట్లు వస్తు ఉత్పత్తి వృద్ధికానందున ప్రపంచమంతట ప్రధానవస్తువుల కొరత, అధిక ధరలు ఏర్పడెను. ఇదే ప్రధాన సమస్య. ఈ సమస్యాపరిష్కారము మీదనే దేశమున, ప్రపంచమున శాంతిస్థాపనా ప్రయత్న ఫలితములు ఆధారపడి యుండును.

జీవిత వ్యయము వృద్ధిమైనందున, కార్మికులుగాని, వ్యవసాయదారులుగాని, నిర్ణీత వేతనములపై ఆధారపడియున్న మధ్యతరగతి వారుగాని తమ వేతనములను వృద్ధిచేయవలసినదని, తమపంటకు హెచ్చుధరలు ఇవ్వవలసిందని కోరుట న్యాయమే. కాని అట్లు చేయుటవలన పరిస్థితులు మరింత అధ్వాన్నమగునే గాని, వేతనముల, పంటధరల హెచ్చించినందున జీవితప్రమాణము అభివృద్ధియగుటకు బదులు, జీవితవ్యయము మరింత పెరిగిపోగలదు. కార్మికులును పంటదారులును ఈ ప్రధానాంశమును గుర్తించుకొని తమ కనీసపు కోర్కెలను ప్రతిపాదింపవలసియున్నది. భారత రైల్వే పనివారి సంఘము ఈ విషయమును గమనించక, "సమ్మె బెదరింపు"కు దిగుట శోచనీయమేగాక విపరీతముగనున్నది. నేడు ప్రజలకు కావలసినది హెచ్చు కొనుగోలు శక్తిగాని, హెచ్చు కరెన్సీనోట్లు గాదు. రైల్వే కార్మిక సంఘము వారు కోరినట్లు తు, చ, తప్పకుండ జీతాలవిచారణ సంఘము వారి సిఫార్సులను కేంద్రప్రభుత్వము అమలుజరిపిన, చెలామణీయందున్న నోట్లమొత్తము పెరుగ వచ్చును గాని, కార్మికుల నిత్యావసరము లేవియు తీరవు; వారిస్థితి చక్కబడదు. గత రెండుసంవత్సరములుగ ఫ్రాన్సు అనుభవించుచుండిన విషాద సంఘటనలను గమనించిన ఈ విషయము బోధపడగలదు.

ఫ్రాన్సు, తదితర దేశములందలి సంఘటనలనుండి భారతీయ కార్మికులు గ్రహింపవలసిన విషయము మరొకటి గలదు. కమ్యూనిస్టులు రాజకీయ అపేక్షల సాధనకు తమ 'పలుబడి'లో నున్న వివిధ వర్గ సంఘములను, కార్మికావసరములను వినియోగించు కొనుచుండిరి. ప్రభుత్వయంత్రము మార్పు చెందుటతో ఈ సమస్యలు వాటికవి పరిష్కారము కాజాలవు. ఏ ప్రభుత్వమైనను ఇట్టి విషమ ఆర్థిక సమస్యలను పరిష్కరించుటకు అనుసరింపవలసిన మార్గము ఒక్కటే. భారతీయ రైల్వే కార్మికులు ఈ సందర్భమున, భారత ప్రభుత్వము అనుసరించుచున్న విధానము ఎంతవరకీ మార్గమునకు సన్నిహితముగ నున్నదని విచారింపవలసి యుండును. కార్మికుల శ్రేయస్సునె భారత ప్రభుత్వము ప్రధానముగ పరిగణించినదని గత ఏడాదిలో అధినివేశ ప్రభుత్వ కార్మిక శాసనముల పరిశీలించిన స్పష్టము కాగలదు. ఇప్పటికిని, శ్రీ గోపాలస్వామి అయ్యంగార్ స్పష్టముచేసినట్లు, రైల్వేపనివారి న్యాయమైన కోర్కెలను విచారించి తీర్చుటకు కేంద్రప్రభుత్వము సిద్ధముగనే యున్నది. సమ్మెకు కార్మికుల ప్రోత్సహించుట అతిసులభమైన విషయమే. కార్మికులకు కూడ సమ్మెనిర్ణయము రుచించినంతగ హేతుబద్ధమైన నిర్ణయములు రుచింపవు. కాని నాయకత్వము వహించినవారు అసలు గమ్యస్థానమును గుర్తుంచుకొనక గాలివాలునుబట్టి తెరచాప ఎత్తి పడవ నడిపిన, గమ్యస్థానమునకు దూరమగుటయేగాక, అతి ప్రమాదకరమైన పరిస్థితిని యెదుర్కొనవలసివచ్చును.

కలకత్తాలో జరిగిన అఖిల భారత రైల్వేపనివారి వార్షికసభయందు సమ్మెకు దిగుట ప్రస్తుత పరిస్థితులలో వాంఛనీయము గాదని, క్షేమకరము గాదని అధ్యక్షుడు జయప్రకాశ్ నారాయణ్ గారు హెచ్చరించి యుండెను. ఇటీవల వార్ధాసభలో కార్మికాభిప్రాయమునుబట్టి కొంతమార్పు ఏర్పడియుండవచ్చును. కాని పూర్వాపరములు గమనించి, తాత్కాలికముగ కార్మికుల అసంతృప్తికి గురికావలసివచ్చినను, సరియైన సలహా నొసగి సక్రమమైనమార్గమున కార్మికుల నడుపుట నాయకుల బాధ్యతై యున్నది. కార్మికులుకూడ తమనాయకుల ఉద్దేశ్యమును, అపేక్షల గుర్తించి, ప్రస్తుతము ఏది క్షేమకరమో, అట్టి మార్గమునే అనుసరించవలెను. భారత రైల్వేలు ప్రభుత్వాధీనమైన తరువాత, ఈ ఏడాది కాలములో తమకు కలిగిన లాభములనొక్క పర్యాయము విచారించుకొని సకార్మికులు బాధ్యతలేక ప్రవర్తింపరాదు. రైల్వే కార్మికులు అత్యంత ప్రధానమైన, బాధ్యతగల పనిని నిర్వహించుచున్నారు. వారు అందుకు తగినవిధముగ వ్యవహరింపవలసియున్నది.

## నెగెవ్ ప్రాంతమున తిరిగి యుద్ధము

### ఫలూజా పట్టణమునకై యూదు అరబ్ సంఘర్షణ

లండన్, నవంబరు 11: ఉత్తర నెగెవ్‌లోని ఈజిప్షియన్ రక్షణస్థానమైన ఫలూజావద్ద ఈజిప్టుసేనలు, ఇస్రాయిల్ సేనలు ఇప్పటికి పోరాడుచున్నట్లు ఈజిప్టు ప్రతినిధి కైరో నగరములో గతరాత్రి ప్రకటించెను. బలీయమైన యూదుసేనలు ఫలూజావద్ద పెద్ద ఎత్తున దాడి జరపగా ఈజిప్టుసేనలు ధైర్యముతో ఎదురుదాడి ప్రారంభించినవనీ, ఇప్పటికి యుద్ధము సాగుచున్నదనీ ఇతడనుచున్నాడు.

భద్రతామండలి రహస్య సమావేశములో తాత్కాలిక మధ్యవర్తి రాల్ఫ్ బంచ్ తన రాజీ ప్రతిపాదనలలో నెగెవ్ ప్రాంతమును పూర్తిగా తటస్థ ప్రదేశమని ప్రకటించుట అవసరమని చెప్పినట్లు తెలియుచున్నది. బంచ్ ప్రతిపాదనలపై అరబ్ యూదులకు ప్రతినిధులు వివరించు అవకాశము ఇవ్వరాదని రష్యా ప్రతిపాదించెను. బ్రిటెన్, అమెరికాలు రష్యన్ సూచనను నిరాకరించినవి.

ఫలూజా, సూయిజ్ కాన్ పట్టణముల మధ్య అరబ్బులు తిరిగి రాకపోకల సౌకర్యములను ఏర్పాటు చేసుకొనగలిగినట్లు అరబ్ వర్గములు తెలుపుచున్నవి. నెగెవ్ యుద్ధారంగమున యూదులు ఈ రెండు పట్టణములపై చక్రబంధవ్యూహము ప్రయోగించి మిగతా ప్రాంతములతో సంబంధములను విడగొట్టిరి. ఈజిప్టుసేనలు ఇక్కడ యూదులకు చెందిన నాల్గు షర్మన్‌టాంకులను పట్టుకొనిరట.

ఫలూజావద్ద అనేకమంది ఈజిప్టు సైనికులు యూదుల చక్రబంధములో చిక్కుకొనినట్లు యూదులు తూర్పుదిశగా ముందుకు సాగుచున్నట్లు, అమెరికన్ అసోసియేటెడ్ ప్రెస్ వార్త తెలుపుచున్నది. ఫలూజా పూర్తిగ యూదువశమైన వార్తలు నిజము కాదట. ఈజిప్టుసేనల పరిస్థితి అతి క్లిష్టముగ నున్నట్లు తెలియుచున్నది.

## భద్రతామండలి రహస్యచర్చ

### సమితి పరిశీలకుల అరెస్టు

పారిస్, నవంబరు 10: పాలస్తీనా సమస్య పరిష్కారానికి మధ్యవర్తి డా॥ రాల్ఫ్ బంచ్ ప్రతిపాదించిన విధానమును చర్చించుటకు భద్రతామండలి నేడు రహస్యముగా సమావేశమగుచున్నది. సంధిసాధనకై యత్నించవలసిన సమయం వచ్చిందని డా॥ బంచ్ అభిప్రాయం.

నెగెవ్ ఎడారిలోని ఇరాక్ సువెడాన్ దుర్గంపై నేడు యూదులు శతఘ్నివర్షం కురిపించిరి. యూదుల చర్యలను గమనించుచున్న ఇద్దరు ఐక్యరాజ్య సమితి పరిశీలకులను యూదు మిలిటరీ పోలీసులు అరెస్టు చేసిరి.

ఈ విషయమును నేడు హైఫాలో ఐక్యరాజ్యసమితి అధికారి ఒకరు ప్రకటించుచూ, ఇస్రాయెల్ ప్రభుత్వానికి నిరసన భావం తెలియపరిచినాడు. నెగెవ్ ఎడారిలో ఈజిప్షియన్ స్థావరాలపై యూదు సైన్యాలు శతఘ్నులు కాల్చుచుండగా ఈ పరిశీలకులు ఇద్దరు ఇస్రాయెల్ రాయబారులతో సహా ఆ స్థానమునకు వెళ్లిరి. అచ్చట ఉండుట ప్రమాదకరమని తిరిగి పొమ్మనిరి ఇస్రాయెల్ రాయబారులు పరిశీలకులకు చెప్పిరి. కాని వారు వినలేదు. అప్పుడు ఇస్రాయెల్ మిలిటరీ పోలీసులు అరెస్టుచేసి ఒక సమీప యూదు గ్రామం తీసుకుపోయి నిర్బంధించిరి. ఇరాక్ సువెడాన్‌పై ఇస్రాయెల్‌కు చెందిన ఒక స్పార్టన్ విమానం రెండు ఫైటర్ విమానాలు పోవుటను పరిశీలకులు గమనించిరి. తరువాత పరిశీలకులను టెల్అవీవ్ తీసుకుపోయి అక్కడ విడిచిపెట్టిరి.

ఈ సంఘటన సమాచారం ఐక్యరాజ్య సమితి చేనియమింప బడినమధ్యవర్తికి తెలుపబడినది.

ఇరాక్ సువెడాన్‌పై శతఘ్నులు కాల్చినట్లునూ ఆ ప్రాంతము తమకు లొంగినట్లునూ యూదులు ప్రకటించిరి. అక్కడ ఉన్న ఈజిప్షియన్ సైన్యం యూదులకు లొంగిపోయినట్లు టెల్అవీవ్‌లో ఒక యూదు ప్రభుత్వాధికారి తెలిపినాడు.

పాలస్తీనాలోని అరబ్ ప్రభుత్వ కేంద్రమైన గాజా పట్టణాన్ని (నెగెవ్‌లో ఉన్న రేవు) యూదులు ఆక్రమించుకోలేదని ఐక్యరాజ్య సమితి కార్యాలయాధికారి నేడు చెప్పినాడు.

అరబ్ ప్రభుత్వాలలో కొన్ని రాజీకి రాయబారాలు పంపినట్లు ఐక్యరాజ్యసమితిలో ఇస్రాయెల్ రాయబారి మైకేల్ కోమే వెల్లడిచేసినాడు. కాని ఆ ప్రభుత్వాల పేర్లు బహిరంగపరచలేదు.

ట్రాన్స్‌జోర్డాన్ ప్రభువు అబ్దుల్లా రెండురోజులు పాలస్తీనా సందర్శనం అనంతరం నేడు తిరిగి అమాన్ చేరినాడు.

### సంధికి యూదు అభ్యర్థన యత్నం

జెరూసలెం, నవంబరు 10: ఇస్రాయెల్ ప్రభుత్వాన్ని గుర్తించి, ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వమిచ్చు పక్షములోనైనా, అరబ్ దండయాత్రాదరాలను స్వదేశాలకు పంపివేసే పక్షములోనైనా, స్వయంగా అరబ్బులతో సంధి యత్నం చేయుటకు ఇస్రాయెల్ ప్రభుత్వాధ్యక్షుడు డా॥ వీజ్‌మన్ సంసిద్ధముగా నున్నట్లు పాలస్తీన్ పోస్టు అను పత్రిక నేడొకవార్త ప్రకటించినది.

## విద్యా కార్యక్రమ పునర్నిర్మాణము

### పరిశీలనసంఘ పర్యటన

చెన్నపట్నం, నవంబరు 10: దేశములోని కళాశాలలలోని విద్యా కార్యక్రమములను, ఉన్నతవిద్యా పరిస్థితులను పరిశీలించుటకై భారత ప్రభుత్వమువారొక సంఘమును నియమించిరి. వీరు పరిశీలనానంతరము విద్యా కార్యక్రమ పునర్నిర్మాణమునకవసరమగు సూచనలను చేసెదరు. ఈ సంఘమువారు చెన్నపట్నమునకు డిశంబరు మూడవవారములో రానున్నారు. సంఘాధ్యక్షుడు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ భారత విశ్వవిద్యాలయముల సంఘాధ్యక్షుడు శ్రీ నిర్మల్ సిద్ధాంత ఈ సంఘమునకు కార్యదర్శి. మిగిలినవారు సభ్యులు: డా॥ తారాచంద్, ప్రొఫెసర్ యం. యస్. సా, డా॥ మేఘనాథ్ సహాని, డా॥ లక్ష్మణస్వామి మొదలియారు డా॥ జకీర్ హుసేన్, ప్రొఫెసర్ జె. డి. హెచ్. కోల్ (ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయము) డా॥ ఆర్థర్ మోర్గన్ (టెన్నెసీ వ్యాలీ అథారిటీ అధ్యక్షుడు) డా॥ వి. టైగర్ట్ (ఫ్లోరిడా విశ్వవిద్యాలయ అధ్యక్షుడు)

## శాసనసభ బడ్జెటు సమావేశము

మదరాసు అసెంబ్లీ బడ్జెటు సమావేశము (1949-50) ఫిబ్రవరి 25 తేదీ ప్రారంభమగును. ఆనాడు ఆదాయవ్యయం అంచనాలు సభలో దాఖలుచేసి, 28 నుండి నాల్గురోజులు చర్చ జరుగును. మార్చి 28 తేదీన డిమాండులపై చర్చ ముగియును. కౌన్సిలులో మార్చి 15 నుండి 9 వరకు చర్చ జరుగును.

### పెట్రోలు కూపన్లు

మోటారులు గలవారు పెట్రోలు కొన్నపుడు కూపనుల పుస్తకం చూపకుండా, చించిన కూపను కాగితాలు పెట్రోలు అమ్మేవారికి యిస్తున్నారు. అది సక్రమ పద్ధతి కాదు. కూపను పుస్తకం అట్టపై మోటారుగలవారి పేరు, బండి నెంబరు వ్రాసియుండును గావున, వారికే సరిగా విక్రయిస్తున్నట్లు తెలియుటకై పుస్తకం గూడా చూపాలని, అది లేనిది పెట్రోలు యివ్వరాదని ప్రభుత్వంవారు ప్రకటించిరి.

## ఎలక్ట్రిసిటీ ఎరువుగా వాడుట

మదరాసు, నవంబరు 9: పంటల అభివృద్ధికై మదరాసు ప్రభుత్వంవారు చేస్తున్న కృషిలో విద్యుచ్ఛక్తిని ఎరువుగావాడి, ఫలసాయము ఎక్కువచేయుట ఒకపద్ధతి. ఈ ఎలక్ట్రోకల్చరు పద్ధతి పరిశోధన చేయుటకు ఎ. ఆర్. శ్రీనివాసరావుగార్ని ప్రత్యేకోద్యోగిగ నియమించిరి. వీరికి చెంగల్పట్టుజిల్లాలో తిరుపోరూరు గ్రామమునందు కొంత పొలము, వలయు సౌకర్యములన్నియు ఇచ్చిరి. పొలంలో వరినాటి మొక్క లేచినాక, కొంచెం నీరునింపిగ, ఆ నీటిలోనికి విద్యుచ్ఛక్తి ప్రసరింపజేసినచో మామూలు పంటకన్న 30% వంతు ఎక్కువగ పండునని వారి అంచనా.

## అదనపు జిల్లాలనుండి ఎగుమతులు

మదరాసు, నవంబరు 9: అదనంగా పంటలు పండే జిల్లాలలో 1948 అక్టోబరు 30 తేదీవరకి ఎగుమతి కావలసినట్లు నిర్ణయించిన ధాన్యాల కొలతయూ, ఎగుమతైనసరకు కొలత సంఖ్యలు యీదిగువ తెలుపబడినవి:-

తంజావూరు నిర్ణీతసంఖ్య 2 లక్షల ట. 2,14,230 టన్నులు ఎగుమతియైంది. నూటికి 107 వంతు. నెల్లూరు 15000 ట. (14169 టన్నులు పోయింది. 94%) గుంటూరు 25000 ట. (25,006) కృష్ణ 1,40,000 ట. (1,16,429 ట.) ప. గోదావరి 2 లక్షలు (1,61,903 ట.) తూ. గోదావరి 78,000ట. (62,66) మొత్తం 6,58,000 (5,94,428 సుమారు 90% వంతు.)

## చెన్నపురి చెంగల్పట్టులలో తెలుగుబోధ

చెన్నపట్నం, నవంబరు 12: చెంగల్పట్టుజిల్లా, చెన్న నగరములలోని హైస్కూళ్లలో తెలుగు భాషను చదువుకొనుటకు, తెలుగులోకాని ఇంగ్లీషులో గాని మిగిలిన సబ్జెక్టులను బోధించుటకు అవసరమైన ఏర్పాటులను చేయించవలసినదిగా విద్యాశాఖాధికారులను, విద్యాశాఖ డైరక్టర్ కోరినారని తెలియుచున్నది. ఈ విషయమై విద్యామంత్రిని ప్రశ్నింపగా ఇది ద్విభాషా ప్రాంతాలన్నింటికి వర్తించునని చెప్పిరి.

## చైనాలో సైనిక శాసనం

(1-వ పేజీ తరువాయి)

సులు శాంతి నెలకొల్పజాలకున్నారు.

ప్రభుత్వ సైనికులు ప్రజాసమూహము లపై రాత్రి తుపాకికాల్పులు జరిపి, ఐదుగురిని హతమార్చిరి పోలీసులు అశాంతిని అణచలేకపోవుచున్నారు.

ఉత్తర చైనాలో హ్సూచౌ నగరమునకై ప్రభుత్వసేనలకు, కమ్యూనిస్టు దళములకు మధ్య మహోగ్రమైన యుద్ధము సాగుచున్నది. ఉత్తర, తూర్పు, పశ్చిమ దిక్కులనుండి హ్సూచౌను కమ్యూనిస్టులు ముట్టడించుచున్నారు. ప్రభుత్వసేనలు తీవ్ర ప్రతిఘటన సాగించుచున్నవి.

సూచౌ నగరంపై మూడు దిశలనుంచి కమ్యూనిస్టులు ముట్టడి చేసినవి. మంచూరియాను ఖాళీచేసి సముద్రంద్వారా వచ్చిన చీనా ప్రభుత్వపు 31-వ సేన సూచౌ నగరమును రక్షించుటకు పోరాడుచున్నది.

ఇంతకుముందు జనరల్ ఫాంగ్ చిహూన్ సేనలలో రెండుదళములు తిరుగుబాటు చేసినప్పటికి వెంటనే అణిచివేయబడింది. షాన్‌టుంగ్ రాష్ట్ర ప్రధాననగరంలోనున్న (సూచౌకు 200 మైళ్లు) సేనలను సూచౌ రక్షణకు చాంగ్ కై షేక్ రప్పించుచున్నాడు. మంచూరియాలో ఇంకనూ ఉన్న మూడు ప్రభుత్వదళాలు సూచౌ నగరరక్షణకు వచ్చుచున్నవి. ఉన్న బలాలను కేంద్రీకరించి నగర రక్షణ బలపర్చుకొనుటకుగాను ప్రభుత్వసేనలు నగరపరిసరాలలో నాలుగు ప్రాంతాలను విడిచి వెనుకకువచ్చి పోరాడుచున్నందువల్ల నగరరక్షణ దెబ్బతినకుండా కాపాడబడిందని ప్రభుత్వవర్గాలవారు చెప్పుచున్నారు. యుద్ధరంగమును పరిమితం చేసినందువల్ల సూచౌ నగర రక్షణకు శాలివంత బలాన్ని ఉపయోగించుటకు "కుదిరక్షణ యత్నం" గా వీలైనదని చెప్పుచున్నారు.

టాంగ్‌స్టన్ నగరాన్ని ఆక్రమించి సూచౌ నగరంపైకి వచ్చిన కమ్యూనిస్టు సైన్యం నగరంవద్ద ప్రభుత్వసేనల ధాటికి తాగలేక వెనక్కు తిరుగుచున్నట్లు వార్తలు చేరినవి. టాంగ్ చెంగ్ ఆక్రమణానంతరం వచ్చిన కమ్యూనిస్టుసేనలు షాంటుంగ్ సరిహద్దువద్ద నిలిపివేయబడినవి.

ఉత్తర అన్హ్వేలో మింకియాన్ అనే నగరాన్ని (నాంకింగ్‌కు 70 మైళ్ళు ఉత్తరాన) కమ్యూనిస్టులు ఆక్రమించుకొన్నారు. పావోటింగ్‌కు ఉత్తరంగా (హోపే రాష్ట్ర ప్రధాననగరం) 20 వేల కమ్యూనిస్టు సైనికులు వచ్చినందువల్ల షాన్సీకి వెళ్లనున్న ప్రభుత్వసేనలను చాంగ్ కై షేక్ పావోటింగ్ రక్షణకు మార్చినాడు. షాన్సీ రాష్ట్ర ప్రధాన నగరమైన టయ్యూన్ సమీపములో ముఖ్యమైన కొండలవద్ద తీవ్ర యుద్ధం జరుగుచున్నది. తూర్పు హోపే రాష్ట్రంపైకి దాడివచ్చిన కమ్యూనిస్టుసేనల వల్ల టంగ్ షాన్ బొగ్గుగనులకు ప్రమాదం ఏర్పడింది.

నాంకింగ్ నగరంలో నేటిరాత్రి వేలాది ప్రజలు అన్నార్తులై వీధులవెంట విచ్చలవిడిగా తిరుగుచూ ఆహారభాండాలను, ధాన్యపు నిలవలను కొల్లగొట్టుచున్నారు. పోలీసుబలాలను పెంచినప్పటికీ అరాచకాన్ని అరికట్టజాలకున్నారు. మిలిటరీ బియ్యపు డిపోలను ఒకసమూహం కొల్లగొట్టుచున్నప్పుడు సైనికులు తుపాకులుకాల్చి అయిదుగురిని చంపినారు. ప్రజాసమూహాలు అనేక చోట్ల బియ్యపుకొట్లను కొల్లగొట్టుచుండగా జనసమర్దంలో క్రిందపడి ముగ్గురు మరణించిరి.

ఆహారపదార్థాలధరలను పెంచినవారికీ, అక్రమంగా నిలవచేసినవారికీ మరణదండన కూడా విధించునట్లు నేడొక ఉత్తరువును చాంగ్ కై షేక్ జారీ చేసినాడు. ఎవరివద్ద మామూలు మాసాలకు కావలసినదానికంటె మించి ఆహారం నిలవఉండరాదని ఉత్తరువు చేయబడింది. కొన్ని వస్తువుల ధరలు నేడు కొంత తగ్గినవి.

సూచౌనుంచి 3000 మంది శరణార్థులు, వీరిలో అనేకమంది విద్యార్థులు నిరాహారులై నాంకింగ్ వచ్చి రైల్వేస్టేషన్‌వద్ద విడిసిరి. గత రెండువారాలలో నాంకింగ్ నగరానికి దాదాపు 20 వేలమంది విద్యార్థులు వచ్చిరి.

అమెరికన్ మిలిటరీశాఖకు చెందినవారి కుటుంబాలను ట్సింగ్ టావో, షాంఘై నగరాలకు విమానాలద్వారా పంపుటకు అమెరికన్ మిలిటరీశాఖ ఏర్పాటు చేసింది.

చీనాలో రేడియో, కేబుల్స్ కంపెనీ వారు ఈశాన్య రాష్ట్రాలలోనూ, ముక్డెన్ ప్రాంతాలలోనూ, తమ కార్యములు నిలిపి వేసినట్లు ప్రకటించినారు.

### అమెరికన్ సహాయంగురించి వాషింగ్టన్ సమాలోచనలు

వాషింగ్టన్, నవంబరు 10: చీనాలో నానాటికి విషమిస్తున్న పరిస్థితిని యునైటెడ్ స్టేట్స్ జాతీయరక్షణ సలహాసంఘం పరిశీలించి, ప్రభుత్వానికి కొన్ని ముఖ్యసూచనలు చేసినట్లు అధికారవర్గములవారు నేడు తెలిపిరి. కమ్యూనిస్టుల విజయాలు, చాంగ్ కై షేక్ ప్రభుత్వ పరాజయాల వల్ల పరిస్థితి ప్రమాదకరముగా నున్నదని ఇప్పుడు పరిగణింపబడుచున్నది. ఇప్పుడు

## తూర్పుగోదావరిలో కోతుల హడావిడి

### మన ప్రభుత్వపు రక్షణ సన్నాహములు

చెన్నపట్నం, నవంబరు 11: తూర్పుగోదావరిజిల్లాలోని రాజోలు, అమలాపురం, కొత్తపేట తాలూకాలలో దాదాపు ఏడెనిమిదివందల కోతులముఠా పంటలను నాశనముచేయుచున్న విలకోతుల ముఠాను అంతమొందించుటకై మన ప్రభుత్వము వారు జూన్ మాసములో నేరూ 2000 మంజూరు చేసియుండిరి. ఇది గాక, ప్రస్తుతము రూ 3000 అదనముగా మంజూరుచేసిరి. ఒక్కకోతిని పట్టుకొన్నచో రూ 3 ఇనామివ్వబడును.

ఈ సుగ్రీవ సైన్యమును త్వరలో పట్టుకొని, వాటిని మారెడుమిల్లి కైనను పంపివేసి, వెంటనే ఈ విషయమై ఒక నివేదికను పంపవలెనని చెన్నరాష్ట్ర ప్రభుత్వము తూర్పుగోదావరి కలెక్టరుకు ఉత్తరువులు పంపిరి.

చీనా సహాయమునకు సరుకులను పంపినచో, ప్రభుత్వమునకు అవి అందునో లేదో అనిసందేహము కలుగుచున్నది. అందువలన జాతీయరక్షణసంఘం ఎప్పటికప్పుడు పరిస్థితిని సమీక్షచేయుచు తమసూచనలను ప్రెసిడెంట్ ట్రూమన్‌కు అందచేయుచున్నది. అయితే సూచనలేవో ఎవరూ బహిరంగపరచుటలేదు.

నేడు ఆర్థిక సహకార నిర్వహణశాఖ చీనాకు 150 90 000 డాలర్ల విలువగల ముడిపత్తి రవానాచేయుటకు అనుమతించినది. చీనాలో ప్రభుత్వం ప్రమాదంలో పడినప్పటికీ చైనాకు సహాయం ఇంకనూ పంపబడగలదని, మార్షల్ కార్యక్రమ నిర్వాహకుడు పాల్ హాఫ్‌మన్ నిన్నరాత్రి ప్రకటించినాడు. ఈ సంవత్సరాంతంలోగా 3, 80, 000 డాలర్ల విలువగల బియ్యాన్ని బర్మానుంచి చీనాకు ఇచ్చుటకు ధనసహాయం చేయుటకు కూడా ఆర్థిక సహకార నిర్వహణ సంఘం అనుమతించినది. అమెరికా విదేశాలకు సహాయముచేయు కార్యక్రమం ప్రకారం నిర్ణయింపబడిన 125 మిలియన్ల డాలర్లలో ఇంతవరకూ 112 మిలియన్ల విలువగల పదార్థములను చీనాప్రభుత్వానికి సప్లై చేసినారు.

## సమితి ఆదేశం

(1-వ పేజీ తరువాయి)

ద్వేషముతోనే తాను ఇట్లు నిందలతిరబడిన ఉపన్యసించితినని, యుగోస్లావియా ప్రతినిధి డా॥ బెబ్లర్ పత్రికా విలేఖరులకు తెలియజేసెను.

గ్రీసు సమస్యకు పరిష్కార మార్గమును అన్వేషించుటకై అగ్రరాజ్య చతుష్టయము ఆస్ట్రేలియా, యుగోస్లావియా ప్రతినిధులూ రహస్య సమావేశం జరపవలెనని ఫ్రాన్సు, ఆస్ట్రేలియాల ప్రతినిధులు అది వారంనాడు తిరస్కరించారిగా ప్రతిపాదన చేసిరనీ, కాని సంయుక్తతీర్మానం మీద వోటింగు జరగనిదే సప్రతిపాదనలకు ఉపక్రమించమని దరిమిలాను వారుపట్టుపట్టి నందువలన తానే లొంగివచ్చి వోటింగుకు అవకాశం కల్పించితినని బెబ్లర్ వివరించెను. బాల్కన్సు కమీషన్ యథాప్రకారం పనిచేయుచుండాలె వలెననీ, పాశ్చాత్యరాజ్యముల సంయుక్తతీర్మానం నిర్దేశించుచున్నది.

ఈ తీర్మానం మీద వోటింగు పూర్తి అయిన తర్వాత, విదేశీసైన్యములను గ్రీసు నుండి ఉపసంహరించవలెనని కోరుతూ రష్యా ప్రతిపాదించిన తీర్మానంలో కొన్ని క్లాజులు మాత్రమే ఆమోదించబడినవి; మిగతా ప్రధానమయిన క్లాజులన్నీ తిరస్కరించబడెను.

బల్గేరియా ఆల్బేనియాలతో రాయబార సంబంధములను ఏర్పాటు చేసుకోవలెనని గ్రీసుకు ఆదేశించుచూ వున్న ఒక క్లాజూ యుగోస్లావియా, బల్గేరియా, ఆల్బేనియాలతో సరిహద్దు ఒడంబడికలను తిరిగి వ్రాసుకోవలసిందని చెప్పే ఇంకో క్లాజు మాత్రమే ఆమోదించబడినవి. గ్రీసులో నివసించుచున్న మాసెడోనియా, ఆల్బేనియా జాతుల యెడల గ్రీసు ప్రభుత్వం విచక్షణ చూపరాదన్న క్లాజూ, విదేశీసోక్యం వల్లనే గ్రీసులో పరిస్థితి విషమించినదన్న క్లాజూ, విదేశీసైన్యములను ఉపసంహరించవలెనన్న క్లాజూ, బాల్కన్సు కమీషనును ఉద్వాసన చెప్పవలెనన్న క్లాజూ, వీగిపోయినవి.

### డా॥ ఇవాట్‌ను పంపవలెనని ఆస్ట్రేలియా ప్రధాని ప్రకటన

కాన్‌బెర్రా, నవంబరు 10: గ్రీసు దేశములో శాంతిసాధనకు ఉభయ పక్షముల మధ్యనూ రాజీయత్నాలు చేయుటకు ఆస్ట్రేలియా విదేశాంగ శాఖా మంత్రి, ఐక్యరాజ్యసమితి అధ్యక్షుడు అయిన డా॥ ఇవాట్‌ను పంపవచ్చునని, ఆస్ట్రేలియా ప్రధాని చిఫ్లీ నేడిచ్చట చెప్పినాడు. ఆల్బేనియా, బల్గేరియా, యుగోస్లావియాలపై గ్రీసు ప్రభుత్వ ఫిర్యాదులను పరిశీలించినారనీ, వారిమధ్య సామరస్యమును సాధించుటకు యత్నించుట తమ ఉద్దేశమనీ, చిఫ్లీ చెప్పినాడు.

## కలకత్తా ప్రాంతంలో అల్లరులు

### పోలీసు కాల్పుల ఫలితంగా 8 మంది మరణం

డైమండ్ హార్బర్, నవంబరు 9: ఈ ప్రాంతంలోని కాకద్వీప్ గ్రామంలో పోలీసులు కొందరు అనుమానాస్పదులను అరెస్టుచేసినందున, జయ్యమంది స్త్రీపురుషులు ఉద్రిక్తులై లాఠీలు మున్నగునవి ధరించి పోలీసుల నెదుర్కొనిరి. పోలీసులప్పుడు తుపాకులుకాల్చగా 3 గురు స్త్రీలు 5 గురు పురుషులు చనిపోయినని తెలియుచున్నది.

### పారిస్‌కు పండిట్ నెహ్రూ పునరాగమన వార్త?

పారిస్, నవంబరు 10: ఐక్యరాజ్య సమావేశం జరిగే "పాలెస్ డిషాలెట్"కు నేడు తిరిగి పండిట్ నెహ్రూ హఠాత్ గమనవార్త వినేసరికి అంతా సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు. పండిట్ నెహ్రూ 10 రోజులక్రిందటే పారిస్‌వదిలి పెట్టాడు. నేడాయన తిరిగి ధర్మకర్తృత్వ సంఘంలో పాల్గొన్నాడని అధికారవార్త ప్రకటింపబడినది. అసలు జరిగిన వింత ఏమంటే; ఐక్యరాజ్య పత్రికా ప్రకటనోద్యోగి ఒకడు విజయలక్ష్మి పండిట్ అని వ్రాయడానికి బదులు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అని వ్రాశాడు.

## టెస్టు క్రికెటు

ఢిల్లీ, నవంబరు 11: వెస్టు ఇండీస్ జట్టుకును అఖిలభారత క్రికెటు జట్టుకును జరుగుచున్న మొదటి టెస్టు పోటీలో యీదినం ఫలహార వేళకు వెస్టు ఇండీస్ జట్టువారు 6 వికెట్లకి 404 పరుగులు చేసియుండిరి. గోడార్డు 44 తో అవుటయినాడు. వీక్సు 68 పరుగులతో ఆడుచున్నాడు. (అ. ప్రె.)

## పెన్నారు-కుముద్వతి

### మద్రాసు మైసూరు ఒడంబడిక

చెన్నపట్నం, నవంబరు 11: పెన్నారు కుముద్వతి ప్రాజెక్టు నిర్మాణ సందర్భమున మద్రాసు మైసూరు ప్రభుత్వములకు ఒడంబడిక కుదిరినదనియు, విద్యుచ్ఛక్తి సరఫరా విషయము కొంత తేలవలసివున్నదనియు మద్రాసు పబ్లిక్ వర్క్సు మంత్రి భక్తవత్సలంగారు నేడు పత్రికాప్రతినిధులతో చెప్పిరి. శంకుస్థాపన ఎప్పుడు జరుగునదనగా దీని వ్యవస్థ దానికి పట్టుకొనిరి.

## ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలు

### అక్టోబరులో తప్పినవారు మార్చిలో కూర్చోవచ్చు

చెన్నపట్నం, నవంబరు 11: 1948-49 అక్టోబరు పరీక్షలో ఎస్. ఎస్. ఎల్. సి. విద్యార్థులు 49 మార్చిలో మళ్లీ పరీక్షకు కూర్చోవరాదని పూర్వము ఒక నిబంధన ఉండెను. 65 వేలమంది విద్యార్థులు పరీక్షకు కూర్చొనేవరను ఉద్దేశ్యముతో తప్పినవారికి కూడా ఏర్పాట్లు చెయ్యడం కష్టమని ఆ ఉత్తర్వు చేసినను. యూనివర్సిటీ దానిని మార్చి కొందరు ప్రభుత్వమునకు విజ్ఞప్తులు పంపినందున అక్టోబరులో తప్పినవారు మార్చిలో పరీక్షకు కూర్చొనవచ్చునని నిబంధనలను ప్రభుత్వమువారు మార్చిరి. వాళ్లు డబ్బు కట్టుటకు జనవరి 31 తేదీదాక వ్యవధి ఉండును.

### ఉద్యోగుల మార్పులు

జనాబ్ సైయద్ బషీరుద్దీను మదనపల్లి ఎక్సిక్యూటివ్ ఇంజనీర్‌గా, సైయద్ రహీముద్దీన్‌గారస్థానే వేసిరి. రహీముద్దీన్‌గారు గోదావరి హెడ్‌వర్క్సు ఎక్సిక్యూటివ్ ఇంజనీరుగా మార్చబడిరి. ఆ హెడ్ వర్క్సులో పని చేయుచున్న శ్రీ వి. వెంకటరామ అయ్యంగార్ మతిపనల్లేలికి బదిలీ చేసిరి.

### రాష్ట్ర ధాన్యోత్పత్తిదార్ల సభ

నిడుబ్రోలు, నవంబరు 9: ఈ నెల 15-వ తారీఖున జరుగవలసిన ఆంధ్ర రాష్ట్ర ధాన్యోత్పత్తిదారుల మహాసభ 21-వ తేదీకి వాయిదా పడినది.

## విద్యామంత్రికి ఆంధ్ర ఉపాధ్యాయుల విజ్ఞాపిక

భీమవరం, నవంబరు 9: విద్యామంత్రి శ్రీ అవినాశలింగం చెట్టిగారు ఈ నెల 13, 14, 15 తేదీలలో పశ్చిమ, తూర్పుగోదావరి జిల్లాలలో పర్యటనచేయు సందర్భమున 14 వ తేదీ సాయంకాలం 4 గంటలకు భీమవరం కాలేజీలో ఆంధ్ర టీచర్సు ఫెడరేషన్ తరఫున వారికి ఒక విజ్ఞాపిక సమర్పింపబడునని, ఫెడరేషన్ అనుబంధ సంఘముల అధ్యక్ష, కార్యదర్శులు, ప్రతినిధులు, విద్యాభిమానులు అందరు దయచేయువలెనని, ఫెడరేషన్ సంయుక్త కార్యదర్శి పోదూరి జోగయ్యగారు కోరుచున్నారు.

